Sri Venkatesvara Oriental Series No. 34.

*Editor* :— Prof: P. V. RAMANUJASWAMI, M. A.

# శ్రీవేంకటేశ్వర స్తుతిరత్నమాల

## ద్వితీయ సరము

శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యపరిశోధనాలయమున
ఆంధ్రవాఙ్మయపరిశోధకుఁడగు
కొరాడ రామకృష్ణయ్య, M. A., చే
సమకూర్పఁబడినది.



తిరుమల తిరుపతి దేవస్థానం బోర్డు ఆఫ్ ట్రస్టీసువారి తరపున
ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు వారగు
శ్రీ సి. అన్నారావు, బి. ఏ., గారి యుత్తరవుపైని
ప్రచురింపఁబడినది.



తిరుపతి
తిరుమల తిరుపతి దేవస్థానముల ముద్రాక్షరశాల

1952

# శ్రీవేంకటేశ్వరస్తుతిరత్నమాల

## ద్వితీయ సర్గము

విషయసూచిక.

ఓం

శ్రీవేంకటేశ్వరాయ నమః

# శ్రీ వేంకటేశ్వరస్తుతిరత్నమాల.

## ద్వితీయసరము.



## పీఠిక

శ్రీవేంకటేశ్వరస్వామి స్తుతిరత్నముల నేరి మాలగాఁ గూర్చి యాస్వామి కర్పించి, యాతని కంఠసీమ నలంకరింపఁ జేయుటయేగాక, భక్తకోటి కంఠగతములుగఁ గూడఁ జేయవలయునను యత్నములలోనిది రెండవది. ఇదివరలో నొకటి శ్రీవేంకటేశ్వర ప్రాచ్యపరిశోధనాలయ గ్రంథమాలలో నిరువదియారవ పుష్పముగాఁ బ్రకటింపఁబడి స్వామి కర్పితమైయున్నది. ఇంకను, అప్రకటితములైన యాంధ్రకవితల్లజుల ప్రబంధరాజినుండి వెలువడిన శ్రీవేంకటేశ్వరస్తుతి రత్నములనేకములు లభించుచుండుటచే, వానిని మఱొకమాలగాఁ గూర్చి స్వామికి సమర్పింప వలయునను నభిలాష యనివార్యమైనది. శ్రీవేంకటేశ్వరప్రాచ్యపరి శోధనాలయ పుస్తకభాండారమున, శ్రీస్వామికంకితమీయఁబడినవి కొన్నియు, నాతని గూర్చిన కథావర్ణనలతోఁ గూడినవి గొన్నియు, నప్రకటితములగు గ్రంథరాజము లనేకములు గానవచ్చుచున్నవి. ఆ యా కవులను గూర్చి గాని,, వారి రచనా విశేషములను గూర్చిగాని విశేష ముగాఁ బ్రశంసించుట కిది తావుకాదు. ఆ కవులను గూర్చి వారిగ్రంథ ములను గూర్చిన సమగ్రపరిశీలనము "శ్రీవేంకటేశ్వరాంధ్రసాహిత్యము" అను నొక గ్రంథరూపమున వెలువరించుట యుక్తము, ఇందా యా

గ్రంథములలోని స్తుతిరత్నములు మాత్రమే కొన్ని సేకరింపఁబడి మాలా రూపమున స్వామికి సమర్పింపఁబడినవి.

ఆంధ్రభాషలో నాంధ్రసాహిత్యమున శ్రీవేంకటేశ్వరస్వామిని గూర్చిన ప్రశస్తియెప్పటినుండి గానవచ్చుచున్నది, యను ప్రశ్నయొకటి యాంధ్రసాహితీపరుల మనముల నాకర్షింపక మానదు. ఆంధ్రుల కిష్ట దైవమగు నీ యేడుకొండలదేవుఁడు తన్నారూపముననే వారు కీర్తించినను, లేకున్న మరి యే యితర రూపమున శ్రద్ధాళువులులై కీర్తించినను గూడ వారివారి కోరికలనెల్లపుడును దీర్చి వారిని గాపాడుచునేయుండెననుటకు సందేహములేదు. "యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజా మ్యహం" అని చెప్పియే యున్నాడు గదా! కాని ఆంధ్రజనులు, నాంధ్రకవులు నే కాలమున నీ దైవమును దమభాషలోఁ గీర్తింపఁదొడంగి యుందురనునదే ప్రశ్న. ఇంతకు నాంధ్రసాహిత్యమే యతిపరిమితమైనది. ఇప్పటికి లభ్యమగు నాంధ్రసాహిత్యమునుబట్టి చూడఁగా క్రీస్తుశకము రెండవదశ శతాబ్ది ప్రారంభమున, నాంధ్రవాగనుశాసనుఁడని ప్రసిద్ధిగాంచిన నన్నయభట్టారకుఁడే యాంధ్రసాహిత్యనిర్మాతలలో మొట్టమొదటివాఁడు గాఁ దలంపఁబడుచున్నాఁడు. కావున నాంధ్రసాహిత్యమంతయుఁజేరి తొమ్మిది శతాబ్దముల కాలపరిమితిగల దగుచున్నది. అయినను ఆదికవియగు నన్నయకాలమున శ్రీవేంకటేశ్వరస్వామి యాంధ్రులకు దైవముగాఁ గలవుచే గీర్తింపఁ బడుచుండెనో లేదో తెలిసికొను నాధార మేమియుఁ గానరాదు. అంతమాత్రమున వేంకటాచలమునకుఁ గాని, తత్పతికిగాని యాకాలమునను దత్పూర్వమునను బ్రసిద్ధిలేదనుటకును వీలు లేదుగదా! ఆద్యంతములు లేని యాదిపురుషున కాంధ్రవాఙ్మయమును బట్టియా కాల నిర్ణయముచేయఁ జూచుట!! ఆంధ్రజనులీస్వామిని తమ యిష్టదైవతముగా నెప్పటినుండి భావించి గుర్తింపఁ బొచ్చిరి, ఆంధ్రకవు లెప్పటినుండి యా దేవుని వాత్సల్యాను గ్రహములకుఁ బాత్రులై,

యాతనిఁ గీర్తించుచుఁదమతమ రచనల నాతనికి సమర్పింపఁ బూనుకొనఁ జొచ్చిరి, అను విషయమే మన జిజ్ఞాసకు మూలము.

తమిళవాఙ్మయమునఁ దొలిలక్షణగ్రంథమనఁ దగిన 'తొల్కాప్పియం' అను దానిలో వేంకటాచలము 'వేంగడం' అను రూపమునఁ బేర్కొనఁ బడినట్లగపడుచున్నది. ఈ తొల్కాప్పియమనునది క్రీస్తుశకారంభ కాలమునాటిదని పలువుర పండితులయభిప్రాయము. ఇంకను తరువాతి కాలమున రచింపఁబడిన దై యుండునని తలంచువారును కొందరు లేక పోలేదు. ఎట్లైనను నన్నయకాలపు టాంధ్రసాహిత్యమునకే డెనిమిదివందల సంవత్సరముల వెనుకటి కాలమందలి దని చెప్పకతప్పదు. అప్పటికి వేంగడమనునది తమిళ 'వడుగు' దేశముల సరిహద్దు ప్రాంతములలోని యరణ్యప్రదేశమునను న్నట్లును, అచ్చటికి తమిళవీరులు ధనకాంక్షచే గాని, విజయకాంక్షచేగాని పోవుటయుక్తము కాదనియు, అట్లు పోయిన వారి స్త్రీలిండ్లయొద్ద హృదయారాటముతోఁ గ్రుంగుచుందురనియు—నాగ్రంథకర్త సూచించియున్నాఁడు. కాని యచ్చటి స్వామిని గూర్చి యాతఁడేమియుఁ బ్రశంసించియుండలేదు. శిలప్పదికారాది తమిళ కావ్యములలోను ఆళ్వారుల కీర్తనలలోను 'తిరువేంగడ' మును గూర్చి, యచ్చటి దేవతల యుత్సవములనుగూర్చి యనేక విధములగు ప్రశంసలు చేయఁబడియున్నవి. శ్రీపర్వతభాగముగా గ్రహింపఁ బడుచుండిన యీ తిరుమల సుమారు క్రీస్తుశకము రెండవ దశశతాబ్ది వరకు దుర్గమారణ్య ప్రదేశముగానే యుండెనేమో యని పలువురు పండితులూహించుచున్నారు. 12 వ శతాబ్దిప్రారంభమున ప్రసిద్ధిగాంచిన యాదవ వంశీయ రాజులకాలముననే పరిసరారణ్యము ఛేదింపఁబడి చంద్రగిరినుండి తిరుపతి నుండి తిరుమలదేవునిసన్నిధికి సరియైన బాట యేర్పాటుచేయబడినవని చెప్పుదురు. తిరుపతి దేవస్థానశాసనములలో నఱవమున వ్రాయ బడినఁ శాసనము లనేకములు చోళపల్లవరాజులనాటివి ప్రాచీనములు కలవు.

కాని తెలుఁగు భాషలో వ్రాయఁ బడిన తొలిశాసనము విజయనగరాజుల కాలము నాటిది గానే కనఁబడుచున్నది. అది తిరుపతి దేవస్థాన శాసనములు మొదటిసంపుటము 179 నెంబరు గలది. మహామండలేశ్వర మీసరగండ మంగిదేవమహారాజు ఇచ్చినది.

" స్వస్తి శ్రీ విజయాభ్యుదయ శకవరుశంబులు 1281 అగునేంటి, వికారిసంవచర ఆషాఢశుద్ధదశమి మందవారాన స్వస్తి శ్రీ మహామండలేశ్వర మీసరగండ మంగిదేవమహారాజులు తిరుమలదేవరకు పటాదిపగగు సువర్ణాది సిఖరమును ఎతించెను మంగళం మహా శ్రీ శ్రీ శ్రీ "

తెలుఁగు బాసలో తిరుమలదేవర తొలిప్రశంసయిదియే గావచ్చునని పించుచున్నది. సుమారీకాలమువాఁడేయనఁదగిన యెఱ్ఱాప్రెగ్గడ తన నృసింహాపురాణమున దీనినొకపుణ్యక్షేత్రముగాఁ బేర్కొనెనేగాని దానిని గూర్చి విశేషప్రశంసయేమియు చేసినవాఁడు కాఁడు.

అతఁడాగ్రంథమును అహోబలనృసింహస్వామి కంకితము చేసెను. ఈ అహోబలక్షేత్రము శ్రీశైలము మొదలుకొని శేషశైలము వరకు శ్రీపర్వతమని ప్రసిద్ధిగాంచిన తూర్పుకనుమలను పర్వతశ్రేణిలో మధ్యభాగము నాక్రమించియున్నది. ఈ క్షేత్రమాహాత్మ్యమును వర్ణించు తీరున నృసింహావతార కథను వర్ణించినాడెఱ్ఱాప్రెగ్గడ. అచ్చట నైమిశారణ్యమునందలి మునులు రోమహర్షణునితో " ఏ తీర్థము కలియుగమున, భూతాభయదానచతురపుణ్యోన్నతి నుద్యోతించు " నని ప్రశ్నింపగా, నాతఁడు గాలవుఁడను మహర్షి చేసిన తీర్థయాత్రల నేకరువుపెట్టుచు, గంగాద్వారము, కాశి, ప్రయాగాది క్షేత్రములను జెప్పినపిదప, నాంధ్రదేశమునందలి క్షేత్రములను జెప్పుచు, సింహాచలము, గోదావరి, కృష్ణవేణుల తరువాత " శ్రీవేంకటాచలస్థాయి " గొలిచెనని తెలిపి, అనంతరము, సహ్యజావేణిదోగ, తత్సవిధసీమ రంగనాథునిఁజూచి, తుద కహో

బిలంబు చేరినట్లు చెప్పినాడు. ఈ సందర్భములో 'వేంకటాచలస్థాయి' యనుటచే వెంకటాచల క్షేత్రమున స్థిరుడై యున్న దేవుని గొలిచెనని చెప్పినట్లు నది. కాని యాదేవుని పేరుగాని, ప్రశంసగాని విశేషముగా నందేమియులేదు. అయినను వేంకటాచలమును గూర్చికాని, అందు స్థిరుడై యున్న దేవునిగూర్చిగాని పేర్కొన్న ఆంధ్రకవులలో నీతఁడే మొదటి వాఁడని, యీతనిగ్రంథమే తొలిగ్రంథమని చెప్పవలసియున్నది. అయితే యిందలి దండకరూపముననున్న విష్ణుస్తుతి దేవతలు పాలసముద్రమున శేషశయనుడై యున్న యాదివిష్ణువునుగూర్చి చేసినదేగాని, శేషశైల నివాసియగు వేంకటనాయకునిగూర్చి చేసినదిగాఁగానరాదు. వేంకటేశ్వర స్వామినిగూర్చిన స్తుతి చిహ్నములుగూడ నందేమియు గానరావు. ఏమైనను ఆంధ్రసాహిత్యమున వేంకటాచలమును పుణ్యక్షేత్రముగా నైనను తొలుతఁ బేర్కొన్నవాఁడు శంభుదాసుఁడగు నెఱ్ఱాప్రగ్గడయే యని చెప్పవలసి యున్నది. ఎఱ్ఱాప్రెగ్గడ పాకనాటిలోని గుడ్లూరు నెలవుగాఁ గలవాఁడగుట చేతను, అహోబిలమునకిది సమీపమందలి దగుట చేతను శ్రీ వేంకటాచలక్షేత్ర మాతని దృష్టిలోనికి వచ్చినదేమో. అంతకుఁబూర్వము నెల్లూరిప్రాంతపు పాకనాటి కవులెయగు, తిక్కన, కేతన, మంచన, మారనాదు లెవ్వరు నేసందర్భముననుగూడ వేంకటా చలమును స్మరించినట్లులేదు. క్రీ. శ. 12, 13, శతాబ్దులయందు ఆంధ్రదేశమున విజృంభించిన వీరశైవమతము మూలముగా, తొలినుం డియు శైవమతమున కాకరముగు శ్రీశైలము మరింత ప్రసిద్ధిలోనికి వచ్చినది. ఆ కాలములో శ్రీశైలమున మల్లికార్జునదేవుని దర్శిం చుటకై యాకొండ నతిసంభ్రమముతో నెక్కుచుండెడి భిన్నదేశీయములగు పరుసలను (పరిషత్తులను) వారియుత్సాహమును, వేషభాషాదులను, పాల్కురికి సోమనాథుఁడు తాను రచించిన పండితారాధ్య చరిత్రలోని పర్వతి ప్రకరణమున విపులముగా వర్ణించినాడు. వేంకటాచలపతి దర్శ

నార్థమై తిరుమల నెక్కుచుఁబోవు పరుసలను గూర్చిగాని, యాదారిలోని స్థలదైవత విశేషములను గూర్చిగాని, చేయఁబడిన ప్రశంసలేవియుఁ గానరావేమి! తాళ్లపాక చిన్నన్న 'అన్నమాచార్యచరిత్ర' యను ద్విపద కావ్యమురచించు వరకు నాంధ్రసాహిత్యమున నట్టివి గానవచ్చుటలేదు. దీనికిఁ గల కారణ మీదేశమందాకాలమునఁ గల మతసాంఘిక పరిస్థితులనుబట్టి మన మూహింపవలసినదే.

నన్నయ్యకుఁ బూర్వము చాళుక్యరాజులు చాలవరకు వైదికమతమునే ప్రోత్సహించినను, దేశమున బౌద్ధజైనాదులగు నవైదికమతములకు నింకను గొంతవ్యాప్తి లేకపోలేదు. జైనమప్పటికే కన్నడదేశమున స్థావరమేర్పరచుకొనినది. రాజనరేంద్రుని కాలమున నాతని వైదిక మతాభినివేశమునకు వైదికమత స్థిరీకరణ ప్రయత్నమునకు నన్నయ భారత సంహితారచనము మంచి దోహద మొసంగినది. అప్పటినుండియు జైనబౌద్ధము లీదేశమున మరల దలయెత్తికొనలేక పోయినవిగాని, కన్నడ దేశమునుండి యవైదిక శైవమతప్రవాహ మొకటి పొల్లుగావచ్చి యీ దేశమును ముంచివేసినది. దానిని ప్రతిఘటించి శివకేశవాభేదరూపమగు "హరిహరనాథతత్వమును" ప్రతిపాదించు తలంపుననే గావలయు తిక్కనార్యుడు "ధర్మాద్వైతస్థితి భారతాఖ్యమగు లేఖ్యంబైన యామ్నాయమున్" దెనుఁగున రచింపఁబూని, అందు "విష్ణురూపాయ నమశ్శివాయ యనిగొల్చెడు భక్తజనంబు వైదికధ్యాయిత కిచ్చు మెచ్చు పర్వతత్వమునే" గొలిచియున్నాడు. తిక్కనార్యుఁడు నెలకొలిపిన యీ హరిహరాభేదభావమే వీరశైవ వీరవైష్ణవముల సంతగా పైకిరానీయక మట్టుపెట్టి, యాంధ్రావళిని చాలవరకు పౌరాణిక మతానుయాయులుగ జేసినది. ఇట్టి సాంఘికస్థితియే తరువాతి యాంధ్రవాఙ్మయమున ప్రతిబింబించి నట్లగపడుచున్నది. తిక్కనసహచరులగు మారన, కేతన, మంచనాదు లీభావములనే పోషించిరి. కేతన విజ్ఞానేశ్వర మనుపేర

యాజ్ఞవల్క్య స్మృతినిగూడఁ దెనిఁగించి స్మార్తధర్మములను వ్యాప్తిగావిం చుటకే తోడ్పడెను. ఎఱ్ఱాప్రెగ్గడ "శంభుదాసుడే" యైనను, భారత, రామాయణ, హరివంశాదులను రచించి నృసింహపురాణమును అహోబిలక్షేత్రమునందలి నృసింహస్వామి కంకిత మొనర్చెను. నాచనసోముఁ డుత్తరహరి వంశమును, తిక్కనరచించిన భారతకథ కావలికథగా నిరూపిం చుచు, నాతనివలెనే తనరచనను హరిహరనాథునకే యంకిత మొసఁగెను. తరువాత శ్రీనాథాదులును కేవల వైదిక మతాభిమానులేయైనను కొందరు శివకథారచన యందాదరము హెచ్చుగాఁ జూపినారు. ఆకాలములోని కాకతీయులు, రెడ్డిరాజులును గూడ వైదిక మతప్రియులె యైనను, శైవాభిమానమే కొంత హెచ్చుగా గలవారేమో. కాని మతద్వేషము కలవారు మాత్రముకారు. ఈ కాలమున వైష్ణవకథారచనలును లేకపోలేదు. తిక్కనతాత భాస్కరుడే రామాయణమును దెనిఁగించినట్లు తెలియుచున్నది. తిక్కన ఉత్తరరామాయణము ఎఱ్ఱాప్రెగ్గడ రామాయణమును దెనిగించినారు. రంగనాథ రామాయణమను ద్విపద రచన యొకటి కలదు. ఇది దేశీయఫక్కి నవలంబించిన దైనను కేవల వైష్ణవమత ప్రతిపాదక మనుటకును వీలులేదు. వెన్నెలకంటి సూరన రచించిన విష్ణుపురాణముగాని, పోతనామాత్యుని భాగవతముగాని—విష్ణు కథలను గూర్చి తెలుపునవేగాని, వైష్ణవమత ప్రతిపాదకములని చెప్పు టకు వీలులేదు. ఈ కవులు వైష్ణవమతస్థులునుగారు. పోతన తనభాగ వతమునఁ గూడ నద్వైతభావమునే వ్యక్తీకరించినాడు. క్రీ. శ. 15-వ శతాబ్దివరకు నాంధ్రసాహిత్యమున సుప్రసిద్ధములగు కావ్యములలో నెచ్చ టను శ్రీ వేంకటాచల ప్రశంసగాని, యందలి దైవంబగు శ్రీ వేంకటే శ్వరస్వామి ప్రశంసగాని కానవచ్చుటలేదు.

పదునేనవ శతాబ్దిలోని యాంధ్రసాహిత్యమునందైనను ఈ స్వామి నిగూర్చి తొలుత విశేష ప్రశంస చేసినవాడు తాళ్లపాక వంశీయుడగు

అన్నమాచార్యులే. ఈతనిని గురువుగను హితునిగను బడసి పెను గొండలో కర్ణాట రాజ్యధురంధరుడైన సాళువగుండ నరసింగరాజు కాలమున నుండెను. ఈ సాళువగుండ నరసింహరాజు ' 1465_1478 సంవత్సరము వరకు కర్ణాటరాజ్యము నేలిన విరూపాక్ష రాయని సేనా నాయకుడుగా నుండి 1478 సంవత్సరము నందాతని రాజ్యము నాక్రమించుకొని 1487 సంవత్సర ప్రాంతమువరకు స్వతంత్రముగా రాజ్యము చేసి నట్లగపడు చున్నది. 1487 సంవత్సరము మొదలుకొని తుళువ నరసింగరాయల శాసనములు కనబడుచున్నందున నప్పటిలోనే యీతని రాజ్యము సమాప్తియై యుండును. సాళువ నరసింహుని పూర్వులు సయితము బుక్కరాజాది కర్ణాటాధీశ్వరులయొద్ద దండనాథులుగా నుండి బళ్ళారి మండలములోని యానెగొంది సంస్థానాదులను పాలించుచుండినట్లు తెలియు చున్నది.

తాళ్లపాక చిన్నన్న రచించిన 'అన్నమాచార్య చరిత్ర' ను బట్టి చూడఁగా—నీ సాళువగుండ నరసింహరాజు కాలమున

" చేరువటంగుటూరనుపురంబేలు,
రాచమూకలలోఁ బరాక్రమశాలి
నాళీకబాంధవాన్వయుఁ డజేయుండు
సాళువ నరసింహజనపాలుఁడొకడు "

కడప మండలములోని తాళ్లపాకకుఁ జేరువను టంగుటూరను పురంబేలు రాచమూకలలోఁ బరాక్రమశాలిగా చెప్పఁబడినాఁడు. కాని యప్పటి కింకనీతఁడు వరాహపురాణమున దాని కృతికర్తలగునంది మల్లయ ఘంటసింగయలచే వర్ణింపఁబడిన రీతిగా

" పోలున్ భార్గవరాముతోడ ననుచున్ భూషింప వేలాపరీ
తేలామండల మాధరాధరముగా నేకాతపత్రంబుగా

నేలున్ సాళువ నారసింహుడు భుజంగేంద్రాద్రిపై నున్న
లక్ష్మీలావణ్యసరోవరాళము చిరశ్రీవృద్ధిగావింపగన్ "

"వేలావరీతేలామండల మాధరాధరముగా నేకాతపత్రంబుగా నేలు" వాడుకాలేదు. అనఁగా నిప్పటికింకను కర్ణాటరాజ్యరమాధురంధరుడు కాలేదన్నమాట. విరూపాక్షరాయల సేనా నాయకుడుగానే యుండి రాచమూకలలోఁ బరాక్రమశాలి యని అనిపించుకొనుచున్న వాడు. కావుననే యాతడన్నమయ్య యొద్దకు వచ్చి యాతనియందు నాతని యిష్టదైవమగు శ్రీవేంకటాద్రిపతియందును భక్తిగలవాఁడై యన్నమయ్యను గౌరవించి తన యూరికి రమ్మన్నాడు. అప్పుడన్నమయ్య యా నరసింగరాయలు "సహజవైష్ణవభక్తి నలిపెడువాడు" గావున నాతని సహవాసమైన దోసము లేదటంచు నాతడంపిన యందలమెక్కి చని 'టంగుటూరి కేశవమూర్తికి వినతుఁడై ఆతఁ డమర్చిన యొక నగరిలో రాజుతో వేరులేనికూరిమి నుండినాఁడట.

అంత "పావనుండగు దాళ్లపాకాన్నమయ్య,
దీవెనలంది వర్ధిలుచు నారాజు,
బలియుడై పరిపంథిబలములనడచి,
నలిరేగి సింహాసనంబుజేకొనుచు
దనసంపదలు సమస్తము నన్నమయ్య
వనియున్నచును వాని కెంతయుఁ బ్రొక్కి
కనకాంబరాదుల గ్రామనంతతుల"
పూజచేసినాడట. అంతేకాదు.
"చేపట్టితన యంతఁజేయఁ దెప్పుడును
హితునిగాగురునిగా నెల్లబంధులుగ
నతనినే భావించి యుంగపంచెడును"

ఇట్లు తొలుత మౌర్యరాజ్యస్థాపకుడగు చంద్రగుప్తునకు చాణక్యుని వలెను,

హైందవరాజ్యరమా ధురంధరులై విజయనగరరాజ్యస్థాపకులగు హరిహర బుక్కరాయలకు విద్యారణ్యులవలెను, అనంతరము శివాజీ మహారాజునకు—రామదాసువలెను, రఘునాథభూపాలునికి గోవిందదీక్షితులవలెను, ఈ సాళువ నరసింగరాయలకు ఆకాలమున నన్నమాచార్యుడు గురువు, హితుడు గూడ నయ్యెనని తోచుచున్నది. ఈతని యుపదేశానుసరణమునను, తదాశీర్వాచనఫలితముగాఁ గలిగిన శ్రీవేంకటేశ్వరస్వామి యనుగ్రహమువలననే, యీతని శత్రువుల వినాశనము, విజయపరంపరలు కర్ణాటరాజ్యసింహాసనము, నతనికి లభించినవను నమ్మకముగలవాఁడయ్యెను. కావుననే యన్నమాచార్యులను తనహితునిగను గురువుగను భావించి, యాతని కిష్టదైవమగు శ్రీవేంకటేశ్వరస్వామి కనేకగ్రామాదులను కానుకలుగా సమర్పించెను. ఇట్లన్నమాచార్యులమూలముగా టంగుటూరి పురాధిపతిగానుండి, క్రమముగా కర్ణాటరాజ్యాధిపతియై "వేలాపరీతేలామండల మాధరాధరముగా నేకాతపత్రంబుగా నేలజొచ్చిన నరసింగరాయల కీర్తిప్రతాపములేగాక, వీరికభిమానదైవతమైన శ్రీవేంకటేశ్వరస్వామి మహిమాప్రసిద్ధులును తెనుగుదేశమునఁ గ్రమముగా వ్యాప్తిలోనికి రాఁజొచ్చినట్లగపడుచున్నది.

కావుననే యితడు కర్ణాటరాజ్య సింహాసనారూఢుడైనపిదప నీతనికి "జైమినిభారతమును" కృతి యిచ్చిన పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడీతనిని "శ్రీ వేంకటాద్రినాథ దయావర్ధితరాజ్య" యను విశేషణముచే నా కృతిపంచమాశ్వాసాదిని సంబోధించినాఁడు.

శ్రీవేంకటాద్రినాథ ద
యావర్ధితరాజ్య, సన్నుతార్థిజనమహీ
దేవాగ వైరినృపరా
జీవ నికర చంద్ర నారసింహనరేంద్రా ॥

(జై. మి. భా. 5 ఆశ్వా – 1.)

పినవీరన్న నరసింహరాయని యాస్థానకవులలో నొకఁడు. ఈతఁడు తాను కృతియిచ్చిన జైమినిభారతములో నీ నరసింగరాయల కీర్తిప్రతాపములను విశేషముగా వర్ణించినాడు.

"సీ. తన భుజాపరిఘచేత ధరావరారోహ
భరియించి బర్బరబాహుఁడయ్యె
దన ప్రతాపంబుచే త దిగంతరంబుల
దీపించి యంబరాదిత్యుఁడయ్యె
రాజమాత్రుండె ధరణీ వరాహబిరుద
వర్ణఫలకాయమాన దుర్వార గర్వి
తాహితోర్వీశవిపుల దోరంతరుండు
సాళ్వగుండయ నరసింగజనవిభుండు."

వ॥ "ఆ రాజపరమేశ్వరుండు అర్హాసన సమాసన్న రాజన్య శిరః ప్రసవవాసనాముద్రితంబైన భద్రాసనంబునం బేరోలగంబుండి పురాణేతిహాస కథాప్రసంగంబుల వినోదించుచు" అన్నాడట :—

క॥ నామది నిరతము భారత
రామాయణ కథలఁ బ్రేమరంజిలు నందుఙ్
జైమిని భారత మనఁగా
భూమి నపూర్వము పురాణముల గణియింపఙ్.

తే॥ ఆపురాణముగనఁ దెనుఁగయ్యెనేని
కుందనము కమ్మవలచిన చందమగును."

"కావున హృద్యానవద్య గద్య పద్యానుబంధంబుగా బ్రబంధం బంధ్రభాషను జైమినిభారతంబునం దశ్వమేధపర్వంబు నిర్విఘ్నంబుగా రచియింపుమని యానతిచ్చిన," నమ్మహాప్రబంధమునకు మంగళాచరణంబుగాఁ దదీయ వంశావళి నభివర్ణించి, సాళువ గుండమహీవిభునకు

నాతని కులభామినియగు మల్లమాంబకును "శ్రీమదహోబిలేశ్వర నృసింహుని యంశమునన్ నృసింహుడున్" పుట్టెనని చెప్పినాఁడు. కాని యీ కృత్యాది ప్రశంసలో నెచ్చటను నీ నృసింహరాయని వైష్ణవాభిమానమును గూర్చిగాని యాతని యిష్టదైవమగు శ్రీ వేంకటేశ్వరుని గూర్చిగాని ప్రశంసింపనేలేదు. ఆకాలమున వేంకటేశ్వరునికంటెను అహోబలేశ్వరుడే తెలుగుకవుల నెక్కుడుగ నాకర్షించి నట్లగపడు చున్నది. అయినను పంచమాశ్వాసాది నీతఁడు "శ్రీవేంకటాద్రినాథ, దయావర్ధితరాజ్య" డను విషయమునుమాత్రము సూచింపకపోలేదు. ఈ సాళువనరసింగరాయని మూలముననే తరువాతి కర్ణాటరాజులలో శ్రీ వేంకటాచలపతి సేవాసక్తి ప్రబలి దినదిన ప్రవర్ధమానమై దేశప్రసిద్ధి గాంచినట్లున్నది. కాని యీతఁడు కర్ణాటప్రభువై నపిదప ప్రబంధకవితనే యాదరించినాడు గాని తొలుత తానుమెచ్చిన దేశిరచనలనుగాని, అన్నమాచార్యులనుగాని మరల స్మరించినట్లే యగపడదు.

సాళువగుండ నరసింహరాజు నంది మల్లయ ఘంట సింగయలచే రచింపఁబడిన వరాహపురాణమును గృతినందిన తుళువ నరసింగరాయలకు పతి. అనఁగా నాతడు కర్ణాటరాజ్యము నేలుచుండిన కాలములో నీతఁ డాతనియొద్ద సేనాధిపతిగా నుండెను. కావుననే తన కృతిపతికి పతియైన సాళువనరసింహరాజ రాజమౌళి పావనాన్వయంబును గూడ మొదల వర్ణింతుమని చెప్పి వారట్లు చేసినారు. "అట్టి నరసింగరాజరత్నంబు చేత మన్నన వడసి, సైన్యనాయక పట్టభద్రత్వంబున, నిర్నిద్ర విజయలక్ష్మీ మహత్త్వంబున, దీర్ఘాయురైశ్వర్య ధుర్యుండై, యీశ్వర నాయకునకుం బ్రియతనూభవుండైన, నరసవసుధాధ్యక్షుండు నిర్వంచితానుగ్రహంబు నందమ కావ్యంబు బరిగ్రహించెం గావున, దదీయ వంశావతారంబు" పిదప వర్ణించినట్లు చెప్పినాఁడు. కాని యీకృత్యాదిలో నెచ్చటను గూడను పిదపవీరచనలనే శ్రీ వేంకటాచలపతి ప్రశంస చేయనేలేదు.

రెండవయాశ్వాసాదిని కృతిపతి సంబోధన పద్యములో మాత్ర మీతఁ డును తన పతివలెనే వేంకటాద్రిపతి సేవా సక్తుఁడని చెప్పినాఁడు :—

క॥ శ్రీవేంకటాద్రి పతి సం
సేవా హేవాకనిపుణ శేషాహిఫణా
శీవిన మన కరకరి సే
వావిభ్రమ ఈశ్వరేంద్రు నరసింహనృపా ॥

( వరా. పురా. 2 ఆ. — 1. )

సాళువ నరసింహరాజు మొదట దండనాథుడుగానుండి విరూపాక్ష రాయుల యనంతరము కర్ణాటరాజ్యాధిపతి యెట్లయ్యెనో, అట్లే యీ సాళువనరసింహరాయుల యనంతరము అనగా 1487 సం. ప్రాంత మున నాతనియుద్ధ సైన్యాధ్యక్షుడుగా నుండిన తుళువ నరసింగరాయ లును కర్ణాటరాజ్యాధీశుడయ్యెను. ఈ సంవత్సరము తరువాతనే యీతని శాసనములు గానవచ్చుచున్నవి. ఈతఁడు రాజ్యమునకు రాకపూర్వమే వరాహపురాణ మీతని కంకితమీయఁ బడియుండును. కావుననే కృతిపతికి పతి యని చెప్పి సాళువ నరసింగరాయని వంశవర్ణనముకూడ నంది మల్లన, ఘంట సింగయలు అందు చేయుట తప్పించినది.

ఇట్లే వరాహపురాణమునకుఁ గృతిపతియై "శ్రీ వేంకటాద్రి పతిసేవా హేవాకనిపుణుఁడ" ని చెప్పఁబడిన తుళువ నరసింహ దేవ రాయలు, శ్రీ వేంకటేశ్వరస్వామికి స్వయముగ నంకితం బొనర్చుచు 'ఆముక్తమాల్యద' యను తెలుఁగు ప్రబంధరాజమును రచించిన శ్రీ కృష్ణదేవరాయల తండ్రియే యను విషయమును మనము ముఖ్య ముగా గుర్తింపఁదగియున్నది. శ్రీ వేంకటాచలపతిని తన యిష్టదైవ ముగాఁ జెప్పికొని, యీతనిఁ గృతిపతిగాఁ జేసి, ప్రసిద్ధాంధ్రప్రబంధము నంకితముగా నిచ్చిన ప్రభువతంసులలో కృష్ణరాయలే మొదటివాఁడు.

అతని పూర్వులగు కర్ణాటప్రభువులు కేవల వైష్ణవు లగునో కాదో చెప్పలేము. కాని, కేవల వైష్ణవునిచే, వైష్ణవ మత పక్షముగ, వైష్ణవ కథనే యితివృత్తముగ గ్రహించి తెలుఁగున రచింపబడిన యుత్తమ ప్రబంధములలో శ్రీ కృష్ణరాయని విష్ణుచిత్తీయమే మొట్ట మొదటిది యని చెప్పక తప్పదు. ఇంతకుఁ బూర్వము తాళ్ళపాక కవుల రచన లనేకములు వేంకటేశ్వరుని గీర్తించుచు వ్రాయఁబడినవి కలవు. వానిని విస్మరించుటకాదు కాని యవి యన్నియు దేశిరచనావిశేషములే కాని ఆముక్తమాల్యదను బోలిన ప్రౌఢ ప్రబంధములు కావు. ఈ తాళ్ళపాక కవుల రచనలును క్రీ. శ. 15-వ శతాబ్దిలో బయలుదేరినవే. ఈ కాలమున మార్గరచనాధురంధరులగు ప్రౌఢకవు లనేకులు గలరు. వారిలోఁ గొందరు శ్రీ వేంకటేశ్వరస్వామి సేవానక్తులగు ప్రభువులకుఁ గృతి యిచ్చినవారును లేకపోలేదు. కాని యాదేవునికిఁ గృతియిచ్చిన వారుమాత్ర మగపడరు. జైమినిభారతమును గృతినందిన సాళువ నరసింగరాయలుగాని, వరాహపురాణమును గృతినందిన తుళువ నరసింహరాయలుగాని, తమ యాస్థానకవుల నెవ్వరిని శ్రీ వేంకటేశ్వరుల కంకితముగా రచింపమని ప్రోత్సహించినట్లులేదు. అన్నమాచార్యులు తొలుత దాను నరసింగరాయలతో నాతని యూరికిఁబోవునపు డాతడుఁ సహజ వైష్ణవ భక్తి నలిపెడువాడు గావున నాతని సహవాసము దోషముకాదు అని తలంచి వెళ్ళినవాడే గాని, నీతడు విజయములనుగాంచి పట్టభద్రుడైన తరువాత నన్నమాచార్యుల నీతఁడొప్పరికించిన రీతిఁజూడగా, నన్నమయ్య తలంచినట్లుగా నీతడంత సహజ వైష్ణవభక్తి కలవాడు కాడేమోయని తోచును. పినవీరనాదులు నీతని వైష్ణవభక్తినిగూర్చి ప్రశంసింపలేదు. కావున నప్పటికింకను బండిత కవిలోకమున వైష్ణవమత ప్రాబల్య మీ తెలుఁగుదేశమున నంతగా నేర్పడలేదేమో యని తలంపవలసివచ్చు చున్నది. దీనికిఁ దగినకారణమును మన మూహింపవచ్చును.

చిరకాలమునుండి, అనఁగా నన్నయకాలము నుండియు తెలుఁగు దేశము వైదికమతమునకుఁ బట్టుకొమ్మయై యుండెను. క్రీ. శ. 12, 13 శతాబ్దులయందు వీరశైవ వీరవైష్ణవ మతములు పశ్చిమ దక్షిణదేశ భాగములందు బయలుదేరి, తెలుఁగుదేశమునఁ గూడ వ్యాపింపఁజొచ్చినవి. వైదికములగు శైవవైష్ణవములకీ దేశమున నాదరము లేకపోలేదు గాని, వీనియందు వీరత్వచిహ్నములుగ నవైదికలక్షణములు పెంపొందిన వెంటనే, వాని సరికట్టి శివవిష్ణువుల కభేదమును నిరూపించుచు, నాయతి వాదమును ఖండించుటయే, నన్నయ ప్రారంభించిన "ఆరూఢ గద్య పద్యాది ప్రబంధ" ప్రౌఢమార్గ కవితా సంప్రదాయము ననుసరించుచు వచ్చిన వైదిక కవులకు ప్రధాన కర్తవ్యమైనది. కావుననే దానిని "విష్ణు రూపాయ నమశ్శివాయ" యని 'హరిహరనాథ' సంకీర్తన రూపమున గొందరు కవులు సాధింప యత్నించిరి. మరికొందరు శంభుదాసాదులు హరివంశ నృసింహ పురాణాదులను దెనిగించి యందలి విషయములను దేశమున వ్యాప్తిగావింప నెంచిరి. మరికొందరు శ్రీనాథాదులు - వైదిక శైవము నవలంబించి తమ రచనలను సాగించుటచే తామే యా కార్య మును సాధింపనెంచిరి. కావుననే పాల్కురికి సోమనాథుని దేశిరచనల మూలముగా నాంధ్ర సాహిత్యమున నెలకొని, తెలుఁగుదేశమందలి జన సామాన్యమును తాత్కాలికముగాఁ గొంతవర కాకర్షింపగలిగిన వీరశైవము, తరువాతి తెలుఁగుజనుల జీవితముపైఁ దన ప్రభావమును విశేష ముగా నెరపలేకపోయినది.

దీనితో పాటు ఆ కాలముననే దక్షిణదేశమున బయలుదేరిన వీర వైష్ణవ మతముకూడ తెనుఁగుదేశమున నా యుగమున సంతవ్యాప్తిలో నికి రాలేదనియే చెప్పవలెను. ప్రాచీన వైదిక సంప్రదాయానుసారముగ శివపూజలును, విష్ణుపూజలును దేశమున సాగుచునే యుండినవి. శైవ మతములకు శివపూజలకు శ్రీశైలము ముఖ్యస్థానము కాగా, విష్ణు పూజ

లకు వైష్ణవాభిమానులకు అహోబిలము ప్రధానస్థానమై యుండినట్లగ పడుచున్నది. పాల్కురికి సోమన తరువాత పిడుపర్తి సోమనాథుడు, బసవన్న, గౌరన, మొదలగు వారు శైవకావ్యములను రచించినారు. బసవపురాణ పద్యకావ్యము, ప్రభులింగలీలలు, నవనాథచరిత్ర అనునవి వీరి కావ్యములు. ఇవి వీరశైవమతమునే యుద్ఘాటించుచు దేశి రచనారీతినే యనుసరించినవి. ఆ కాలముననే కాచవిభుడు విఠ్ఠలరాజుల పేర - రంగనాథరామాయణము, వెన్నెలకంటి సూరన విష్ణుపురాణము, పోతన భాగవతము, భైరవకవి శ్రీరంగమాహాత్మ్యము బయలుదేరినవి. కాని యివి కేవల వైష్ణవమత సంప్రదాయోద్ఘాటకములుగాని, వైష్ణవులచే రచితములుగాని కావు. ఇక తిక్కన, నాచనసోమన, దూబగుంట నారాయణకవి, బైచరాజు వెంకటకవి మొదలగువారు హరిహరనాథ భక్తినీ, శివకేశవాభేదమునూ ఉద్ఘాటించుచునేయున్నారు. ఈ కాలమందలి విష్ణు పురాణాదులు కేవల వైష్ణవ సంప్రదాయములనే యుద్ఘాటించునవి కాక పోగా, నాచన సోమనాదులు వారి గ్రంథములలో నా కాలమున దేశములోఁ గలిగిన శివవైష్ణవ భేదమును, తత్కృతవాదములను పరిహరింప దొరకొనిరా యను సందేహముకూడ కలుగక మానదు. తిక్కన హరిహరనాథుని గీర్తించి యూరకున్నాడేగాని ఉత్తరహరివంశములో సోమన యావాదములను స్పష్టముగా ఖండించినాడు.

"పరివాదాస్పద వాదమోద మదిరాపానంబుచే మత్తులై
హరి మేలంచు హరుండు మేలనుచు నేలా వాదముల్"

అని వానిని గర్హించినాడు. కృష్ణుడు బదరికాశ్రమములో శివుని గూర్చి తపస్సుచేయుట, పాశుపతాస్త్రమునకు నారాయణాస్త్రమునకు పోట్లాట గలుగఁగా బ్రహ్మదేవుడు వచ్చి "ఓహో మీరిట్లు పోరిన జగత్ప్రళయము కలుగును గాన ఉపసంహరింపుడు" అని చెప్పి శాంతింప జేయుట, శివకేశవు లేకరూపమును బొందుట మొదలగు కథాంశములు

పురాణాంతర్గతములే యైనను, తాత్కాలిక సాంఘిక జీవిత చరిత్రమును గూడఁ జిత్రించునవివలెనే యగపడుచున్నవి. ఎఱ్ఱాప్రెగ్గడ తన నృసింహ పురాణము నహోబిల నృసింహస్వామి కంకితమిచ్చుటచేతను, వెంకటాచలము నొక క్షేత్రమాత్రముగఁ బేర్కొని యూరకుండుటచేతను ఆ కాలమున కహోబిల క్షేత్రమునకున్న ప్రసిద్ధి వేంకటాచలమునకుఁ దెనుఁగు దేశమున నింకను ఏర్పడియుండలేదేమో యని సందేహింపవలసివచ్చుచున్నది. ఎఱ్ఱాప్రెగ్గడవలెనే, అనంతామాత్యుడును తన భోజరాజీయమును అహోబిల నృసింహస్వామికే యంకిత మిచ్చినాఁడు. అతఁడు వెంకటాచలమును గూర్చిన ప్రశంస యేమియుఁ జేయనేలేదు. 15-వ శతాబ్ది పూర్వభాగమున నున్న మడికి సింగనయుఁదన వాసిష్ఠరామాయణమును అహోబిల స్వామికే యంకిత మొనర్చెను. ఇంతేగాక మన యన్నమాచార్యుని గురువుగా హితునిగా భావించినవాఁడును "శ్రీ వేంకటేశ్వర ప్రసాదలబ్ధ విజయుఁడుగా" జెప్పఁబడినవాఁడు నగు సాళువగుండ నరసింగరాయలు కూడ "శ్రీమదహోబిలేశ్వర నృసింహుని యంశమునన్" బుట్టినవాడే గదా! అటు రాజమహేంద్రవరమునుండి ఇటుకొండవీడు, కర్ణాటమువరకు గల రాజాస్థానముల ననేక సన్మానములనంది — ఆంధ్రదేశ మంతటను జుట్టబెట్టిన శ్రీనాథుని దృష్టినైన నీ వేంకటాచలస్వామి యా కాలమున నాకర్షింపలేకపోయినాడు. శ్రీ వేంకటేశ్వరస్వామి సేవాసక్తులైన సాళువ, తుళువ నరసింగరాయ లిద్దరునుగూడ నా దేవుని కొక కృతి నైనను దమ యాస్థానకవులచే నంకితము చేయించినవారు కాలేదు. వారి యాస్థానమునందలి కవులుగాని, వారికిఁగృతులఁ నిచ్చిన కవులుగాని అంత వైష్ణవమతాభిమానము కలవారు కారేమో. ఆ రాజులును కేవల వైష్ణవమతాభిమానులని చెప్పుట కవకాశము కనఁబడదు. కావుననే తరువాతి పదునారవశతాబ్దిని, స్వయముగ వైష్ణవమతాభిమానియై, తన్మత తత్త్వమును వ్యక్తీకరింపఁగల కథాంశమునే యితివృత్త

ముగా గ్రహించి ప్రౌఢప్రబంధమును రచించుటయే గాక, దానిని తన యిష్టదైవమగు శ్రీ వేంకటేశ్వరునకే అంకితమిచ్చు తొలిభాగ్యము తుళువ నరసింగరాయని పుత్రుడగు శ్రీ కృష్ణదేవరాయనికే లభించుట తటస్థించినది. ఈ కృష్ణరాయని కించుకపూర్వము - అనగా 15-వ శతాబ్ద్యంతిమ భాగమున వెన్నెలకంటి సూరన దాను దెనుగున రచియించిన విష్ణుపురాణమును "కర్ణాటనరేంద్రదత్త సముదంచితశాశ్వత రాజ్యవైభవుఁ"డై పాకనాటిలోని గుడ్లూరు రాజధానిగా నేలుచు వైష్ణవ మతాభిమానియైన రావూరి రాఘవరెడ్డి కంకిత మొనర్చెను. ఈ రాఘవ రెడ్డి తిరుమల తాతాచార్యుని శిష్యుఁడైనట్లు,

> "తిరుమలతాతయదేశిక, వరశిష్యునకనుపమేయ వైదుష్యునకుఁ
> పరభూపాలతమస్సం, హరణాదిత్యునకుఁ బల్లవాదిత్యునకుఁ"

అను పద్యమువలనఁ దెలియవచ్చు చుండుటచే — తిరుమల తాతాచార్యుల శిష్యులై వైష్ణవాభిమానముగల ప్రభువు లాకాలమున గొందరైన లేకపోలే దని తెలియ వచ్చుచున్నది. కాని విష్ణు పురాణమును దెనిగించిన సూరన మాత్రము వైష్ణవుడు కాడు. వైష్ణవ మత దృష్టితో నాతడు దానిని దెనిగింపనూ లేదు. కావున నప్పటి కింకను ప్రసిద్ధ కవులలో వైష్ణవమతాభి నివేశము గలిగి కేవలము వైష్ణవ మతమునకు సంబంధించిన కథలను కావ్యములుగా రచించువారు బయలుదేర లేదని తలంపవలసియున్నది.

క్రీ. శ. 13-వ శతాబ్దిలో నవైదికమగు వీరశైవమతమును జన సామాన్యమున వ్యాప్తిగావించు నుద్దేశముతోడనే ద్విపద, రగడ, సీస, గీతోదాహరణాది దేశిరచనల మూలముగా (ఆరూఢ గద్య పద్యాది ప్రబంధ పూరిత సంస్కృత భూయిష్ఠరచన, మానుగా సర్వ సామాన్యంబుగామి, జాను తెనుఁగున విశేష ప్రసన్నతతోఁ గోర్కె దైవార రచన గావింతునని" చెప్పి) దానిని తెలుఁగుబాసలో నెలకొలిపి, యాంధ్ర

దేశమున శ్రీశైలమును, ఆ శ్రీశైలమందలి మల్లికార్జునుని ప్రఖ్యాతిని వ్యాపింపఁ జేయుటకుఁ దోడ్పడిన పాల్కురికి సోమునివలెనే, 15-వ శతాబ్దమున, ఆ శ్రీపర్వతమునకే దక్షిణపు కొన యందలి శేషశైలము నధిష్ఠించియున్న శ్రీవేంకటేశ్వరస్వామి మహిమాతిశయమును వైష్ణవ మత తత్వమును, ద్విపద, వచన,సంకీర్తనాది దేశిరచనల మూలముగా నాంధ్రభాషలో నెలకొల్పి కర్ణాటకప్రభువులచే ననేకములగు కానుకల నా దేవునకు సమర్పింపఁజేసి, యా దేవుని ప్రఖ్యాతిని, వైష్ణవమతమునందభి నివేశమును తెలుఁగుదేశమున వ్యాపింపఁజేయుటకు ప్రయత్నించిన వారు తాళ్లపాక వంశీయులగు నన్నమాచార్యాదులు. పాల్కురికి దేశిరచనల వలెనే తాళ్లపాక వంశీయుల దేశిరచనలును ఆంధ్రవాఙ్మయమందలి దేశిశాఖ కమూల్యా లంకారము లనకతప్పదు. అయితే — నన్నయ తీసిన "ఆరూఢ గద్యపద్యాది ప్రబంధ పూరిత" మగు "మార్గము" రాజమార్గమయినతోడనే సహజమగు "దేశిబాట" నడచువారు లేక కప్పు వడిపోవుట తటస్థించినది. శ్రీవేంకటేశ్వరస్వామిని దర్శించువారికి గౌరవ ప్రదము అనాయాస సాధ్యమునగు మోటారు మార్గమొకటి పడినతరువాత, కష్టసాధ్యము, నికృష్టమునగు "నడకత్రోవ" ను బట్టుకొనుచు నాథ్యులెవ రైన నుందురా! ఈ దేశి "నాటుత్రోవ" కూడ కొద్దికాలములో కప్పువడి పోవలసినదె !! కాని యామోటారు మార్గమునఁ బోవుటకు ధనము వెచ్చింపలేని సామాన్యజనుల కాదేవునియందుఁ గలభక్తి తాత్పర్య ములే యాబాట — ఆనాటు త్రోవ — కప్పువడి పోవకుండఁ గాపాడఁబడు టకుఁ గారణమగును. మరుగుపడి పోవనున్న నాటుత్రోవ కీకాల మున విద్యుద్దీపము లలంకారములై చిత్రశములగు భక్తవరులననేకుల నాకర్షించునట్లే, కాలగతి నంతరించి పోవనున్న యీ దేశిరచనలును ఈ కాలమున ముద్రణ సంస్కారములను బొంది సాహిత్యవిమర్శకులదృష్టి నాకర్షింపఁ గలుగుచున్న విగదా.

ఇట్లు "మార్గపద్ధతి" నైన ప్రౌఢ ప్రబంధ రచనామూలముగా నాంధ్ర సాహితీలోకమును శేషశైలము వైపునకును శేష శేషిభావము వైపునకు నాకర్షింపఁగలిగిన కవితా సార్వభౌముఁడు విజయనగ రాంధ్ర సామ్రాజ్య ధురంధరుఁడగు శ్రీ కృష్ణదేవరాయఁడే యని గుర్తించినాము గదా. ఈతఁడు ప్రాచీనాంధ్రుల - అనగా క్రీస్తుశక ప్రారంభమునాటి శాతవాహ నాంధ్రరాజుల - సామ్రాజ్యధురమును 15 వందల యేండ్ల పిదప మరల ధరించిన వాఁడేగాక, ఆ ప్రాచీనాంధ్రులకుల దైవతమై కృష్ణానదీ తీరమున శ్రీకాకుళ క్షేత్రమున నెలకొనియుండి అప్పటినుండి యిప్పటి వరకు నా యాంధ్రుల శిల్పకళా వైభవముతోపాటు వారి క్షేమాభివృద్ధులను గాపాడుచుండిన, ఆంధ్రవిష్ణువే — ఆ యాంధ్ర వల్లభుడను దేవుఁడే, శ్రీపర్వతము దక్షిణపు భాగమున శ్రీవేంకటాచలపతి రూపమున నెలకొని యా యాంధ్రులసంతతి వారి కిష్టదైవమై వారి కోర్కెల దీర్చుచున్నవాఁడను విషయమును తెలుఁగుదేశీయు లందరకు వెల్లడించిన వాఁడుగూడ నైనాఁడు. లేదా ఆ యాంధ్రదేవుఁడే యీ కృష్ణరాయల మూలముగఁ దన స్వరూపస్థితులను వెల్లడించికొనిన వాఁడఁనియుఁ జెప్పవచ్చును. ఈ సందర్భమున నీ యాంధ్రవిష్ణు వెవ్వరో యించుక మనము తెలిసికొనవలసి యున్నది.

ఆంధ్రుల కాదిదైవమే యీ యాంధ్రవల్లభుఁడు. అతఁడే ఆంధ్రవిష్ణు వనుపేర కృష్ణాతీరమునందలి శ్రీకాకుళక్షేత్రమున వెలసినవాఁడు. ప్రాచీనాంధ్రులు అనఁగా నైతరేయ బ్రాహ్మణమున విశ్వామిత్ర శాపహతులై పుండ్ర పుళింద మూతి బాద్యనార్య జనసంఘముతోపాటు వింధ్యకు దక్షిణ భాగమున నివసించుచుండినట్లు చెప్పబడిన యాంధ్రులు - కాలక్రమమున దక్షిణదేశమునకు తరలివచ్చి మొట్టమొదట రాజ్యస్థాపనము చేసినది యీ కృష్ణాతీరము నందలి శ్రీకాకుళ ప్రాంతముననే యని తెలియు

చున్నది. కాలక్రమమున నీ శ్రీకాకుళము కృష్ణానదీగర్భమునఁ జేరుట చేతను గావలయు ధాన్యకటక మాంధ్రరాజ్యమునకు రాజధాని యైనది. కాని శ్రీకాకుళము మాత్ర మాంధ్రవల్లభుడను పేరఁబరగిన యాంధ్ర విష్ణువునకు పుణ్యక్షేత్రమై యప్పటినుండి యిప్పటివరకు నాంధ్రులకు యాత్రాస్థానమై నెగడుచున్నది. ఈ యాంధ్రవల్లభుడుకూడ మొట్ట మొదట నుత్తర దేశమునుండి కృష్ణాతీరమునఁ జేరి యచట నెలకొనిన యాంధ్రులతోపాటు వచ్చిన వారినాయకుఁడే — ఆంధ్రనాయకుఁడే — యైనను, పిదపనాంధ్ర విష్ణువుగామారి వారి కులదైవమగుటను గూర్చిన కథ లనేకములు గలవు. గంగాతీరమునఁ దన్నుఁ బ్రసన్నుని జేసికొను టకుగాఁ దపంబు సలుపుచున్న బ్రహ్మతో నిట్లు విష్ణుమూర్తి చెప్పినా డట. ఎల్లప్పుడు తాను గంగ పొత్తుననే యుండుట సహింపక కృష్ణవేణి తన సాన్నిధ్యమును గోరిన దగుటచే, తా నామె కోర్కెఁదీర్చుట కచ్చటికిఁ బోవలసి యున్నదనియుఁ గావున నాతడు (బ్రహ్మ) కృష్ణాతీర మునకుఁ బోయి తపస్సు చేసినచోఁ దానచ్చటఁ బ్రత్యక్షమై యిద్దర కోర్కెల నొక్కమారె తీర్చెదననియుఁ జెప్పెనట. ఆ రీతిగనే ఘోరారణ్య మధ్యమున కృష్ణవేణీ తటంబునఁ దపము సల్పిన బ్రహ్మ కాతఁడు ప్రత్యక్షమై, యచ్చటి శ్రీకాకుళ క్షేత్రమున నాంధ్ర విష్ణు వనుపేర బ్రహ్మచేఁ బ్రతిష్ఠాపితుడై యాంధ్రుల యోగ క్షేమముల నారయుచు వారిపూజల నందుచు నుండెనట. క్రి. శ. 15-వ శతాబ్ది పూర్వభాగమందలివాడగు అనంతామాత్యుడు తాను రచించిన భోజ రాజీయములోఁ దనతండ్రియైన తిక్కన కృష్ణాతీరమునందలి శ్రీకాకుళమున కొడయడై యీ యంధ్ర వల్లభుని సేవఁజేయుచుండినట్లు చెప్పుచు — ప్రత్యక్షి పరమపదమ్మనంగ నొప్పు శ్రీకాకుళంబున అని దానిని వర్ణించినాడు.

"విలసితంబగు కృష్ణవేణీ మలాపహా
రిణి భీమరథి నా ధరిత్రి యందు
ధరనివాసంబగు పెరుమగూరిపురంబు
నందు విద్వజ్జనానందమైన
జీవనస్థితిచేతఁ జెన్నొంది వంశక
ర్తృత్వసంపత్తిఁ బ్రభుత్వమొంది."
నెమ్మిఁ బ్రత్యక్షపరమపదమ్మనంగ
నొప్పు శ్రీకాకుళంబున కొడయఁడైన
యంధ్రవల్లభహరిసేవ నలరుచుండుఁ
బెక్కుభంగుల ముమ్మడి తిక్కవిభుఁడు.

ఈ శ్రీకాకుళాంధ్రవల్లభుని తిరునాళ్లను గూర్చి శ్రీనాథుఁడు గూడ వర్ణించియున్నాడు.

అట్లు తొలికాలమునుండి యాంధ్రులపాటి యిష్టదైవమై కృష్ణాతీరమందలి శ్రీకాకుళక్షేత్రమున నెలకొనియున్న యీ ఆంధ్రజలజాక్షుడే ఆంధ్రభోజుడగు శ్రీకృష్ణరాయలు కళింగ విజిగీషామనీషను దండెత్తిపోయి, విజయవాటిఁ గొన్నివాసరంబులుండి శ్రీకాకుళక్షేత్రమునం దన్ను "ఆంధ్రమధుమదనుం" గొలువ వచ్చి హరివాసోపవాసంబచ్చట గావింప నప్పుణ్యరాత్ర చతుర్థయామంబున నాతని స్వప్నమున సాక్షాత్కరించి యిట్లని యానతిచ్చెనట.

సీ॥ పలికితుత్ప్రేక్షోపమలు జాతిపెంపెక్క
రసికులౌనన మదాలసచరిత్ర
భావధ్వనివ్యంగ్య సావధిగాఁగఁజె
ప్పితివి సత్యా వధూప్రీణనంబు

శ్రుతిపురాణోప సంహిత లేర్చికూర్చితి
సకలకథాసారసంగ్రహంబు
శ్రోత్రఘచ్ఛటలు విచ్చగ రచించితి సూక్తి
నైపుణిజ్ఞాన చింతామణికృతి
తే॥ మఱియు రసమంజరీ ముఖ్యమధుర కావ్య
రచన మెప్పించి కొంటి గీర్వాణభాష
నంధ్రభాషయసాధ్యంబె యందునొక్క
కృతి వినిర్మింపు మిఁకమాకుఁ బ్రియముగాఁగ.

ఉ॥ ఎన్నినుఁగూర్తునన్న, విను, మే మును దాల్చినమాల్యమిచ్చిన
ప్పిన్నది రంగమందయిన పెండిలిసెప్పుము, మున్నుగొంటినే
వ న్ననదండ యొక్కమగవాఁడిడ, నేను దెలుంగురాయడన్
గన్నడరాయ, యక్కొడువఁగప్పు ప్రియాపరిభుక్తభాక్కధన్ !!

ఆ॥ తెలుఁగదేలయన్న, దేశంబుదెలుఁగేను
దెలుఁగు వల్లభుండ, దెలుఁగొకండ
యెల్లనృపులు గొలువ నెఱుఁగవే బాసాడి
దేశభాషలందుఁ దెలుఁగు లెస్స

క॥ అంకితమోయన నీకల,
వేంకటపతి యిష్టమైన వేల్పుగుటఁదదీ
యాంకితముసేయు,
మొక్కొకసంకేతముగా కతఁడ రసన్నెగానే !

ఇట్లు గంగాతీరమున నుండివచ్చి కృష్ణాతీరమున శ్రీకాకుళక్షేత్రమున నెలకొనిన "యాంధ్రవిష్ణువే" దక్షిణమున నాంధ్రసామ్రాజ్య స్థాపకుడైన కృష్ణరాయలవలనఁ దెనుగున కృతినందఁగోరి తాను తెలుగు వల్లభుడననీ, 'దేశభాషలందుఁ దెనుగు లెస్స' యని తత్సార్వభౌముని

మూలముగా వ్యక్తపరచుటేగాక, పేరుభేదమేకాని తానే శేషశైలము నధిష్ఠించియున్న వేంకటపతి నని గూడ లోకమునకంతకుఁ జాటి చెప్పిన వాఁడైనాడు. కావున తొల్లిటి నుండియు నాంధ్రులపాలిటి దైవమగు శ్రీకాకుళాంధ్రనాథుఁడే—శ్రీవేంకటాచలపతి యను విషయ మిందుమూలముగా ధృవమగుచున్నది. దీనికి కృష్ణరాయలే సాక్షియైనాఁడు. ఆంధ్రప్రబంధరాజికి మకుటాయమానంబగు నాతని యాముక్తమాల్యదయే నిదర్శనమైనది. ఆంధ్రులపాలిటి యీ దైవతముల యేకీభావమును సువ్యక్తముచేయుచు, శ్రీవేంకటేశ్వరస్వామికిఁ గృతి యీయఁబడిన మొట్ట మొదటి ప్రబంధమగుట చేతనే—కృష్ణరాయని ఆముక్తమాల్యదలోని స్తుతిరత్నములిందు ముందుసేకరింపఁబడినవి.

శ్రీకృష్ణదేవరాయల యొక్కయుఁ దద్వంశీలయులగు నితర విజయనగరరాజుల యొక్కయు భక్తికైంకర్యాదుల మూలముననే వేంకటాచలము యొక్కయు, శ్రీవేంకటాచలపతి యొక్కయుఁ గీర్తిప్రభావాదులు మహిమా విశేషములు తెలుఁగు దేశమందేగాక, ఉత్తరదక్షిణప్రాంతములందును విశేషవ్యాప్తిగాంచియుండున నుటకు సందేహములేదు. కాని కృష్ణరాయల కాలములో నాతఁడొక్కఁడు తక్కతక్కిన యాతని యాస్థానకవులుఁగాని యితరులగు ప్రసిద్ధకవులెవ్వరును గాని శ్రీవేంకటేశ్వరస్వామి కంకితమిచ్చినవారు కనఁబడరు. అల్లసానిపెద్దన శఠకోపయతిశిష్యుఁడు, వైష్ణవమతాభిమానము కలవాడే కాని యాతఁడు నట్లు చేయలేదు. పారిజాతాపహరణకర్త—ముక్కుతిమ్మన మాత్ర మీ క్రింది పద్యములచే శ్రీవేంకటస్వామినించుక స్తుతించినాడు గాని యాతనికిఁ గృతియియ్యలేదు.

> " శ్రీమది కింబ్రియంబెసఁగఁ బేర్చినయుయ్యేలలీల వైజయం
> తీమిళితాచ్ఛకౌస్తుభము నిద్దపుఁగాంతి దనర్చియాత్మవ
> క్షోమణి వేదిఁబొల్పెసఁగఁ జూడ్కులపండువుసేయు వేంకట
> స్వామి గృతార్థుఁజేయు నరసక్షితి నాథుని కృష్ణరాయనిన్."

క॥ శ్రీవేంకటగిరి వల్లభ,
సేవాపరతంత్రహృదయ ! చిన్నమదేవీ !
జీవితనాయక ! కవితా
ప్రావీణ్యఫణీశ ! కృష్ణరాయమహీశా ! !

ఇట్లే 16-న శతాబ్ది గడువఁజొచ్చినది. ఈసమయమున అనగా 16-శతాబ్ది తుదిభాగమున "కొండపల్లీ పుటభేదనమంత్రి మకుటభూషణు" డైన కుంటముక్కల పిన్నభైరవుఁడను నాతడు

'కులశేఖరప్రభావుఁడు, తిరుమలతాతార్యుఁ డాత్మదేశికుడన సుస్థిరకీర్తి సప్తసంతతి పరుఁడగు పినభైరవుండు'

కొక్కోకగ్రంథరచయితయగు కూచిరాజు ఎఱ్ఱనను, 'సకలనీతి కథానిధాన' మను గ్రంథమును రచింపఁ బురిగొల్పి యద్దానిని

"మాకిష్టదైవమగు నా
శ్రీకాంతుఁడు వేంకటాద్రి శేఖర వాసుం
డాకృష్ణున కర్పణముగ
నీకవిత కథానిధాన మిడు సద్భక్తిన్"

అని కర్పూర తాంబూల కనకాభరణాంబరంబు లొసంగి, తనకిష్టదైవమగు వేంకటాద్రి శేఖరవాసున కర్పింపుమని ప్రోత్సహించినాడట. ఆ కవియు నట్లుచేసెను. ఈ రీతిగా శ్రీకృష్ణరాయల తరువాత శ్రీవేంకటాచలపతి కంకితముగా నర్పింపఁబడిన ప్రౌఢాంధ్ర ప్రబంధము కూచిరాజు ఎఱ్ఱన రచించిన "సకలనీతికథానిధాన" మనునదిగాఁ గనంబడుచున్నది. కావుననే యిందలి పద్యము లీ స్తుతిరత్నమాలలో ద్వితీయస్థాన మలంకరించినవి.

ఈ పదునారవ శతాబ్ది చరమభాగముననే లక్ష్మీవిలాసమను మరియొక ప్రబంధము వెంకటేశ్వరస్వామికిఁ గృతియీయఁబడియున్నది.

కర్ణాట ప్రభువులెవ్వరును తాము రచించిగాని తమకాశ్రితులగు కవులచే రచింపించి గాని తనకుఁ గావ్యకన్యకలను సమర్పింపఁ దలంపలేదని తలంచి గాఁబోలు నాస్వామి తానే స్వయముగా నాయాంధ్రకవులకు స్వప్నమున సాక్షాత్కరించి వారివలన నాంధ్రకావ్యములను గృతిగొన సిద్ధపడెను. కర్ణాటరాజ్య ప్రభువగు శ్రీరంగరాయలు చంద్రగిరిని పాలించుచున్న కాలమున నాతనియొద్ద "రాయసము వ్రాయంజాలి" — సకలాధిపత్య నిర్వాహకుఁడని జనులెన్న వెలసియున్న రాయసము వేంకటపతి యొక్క మహాప్రబంధంబు రచియింపఁబూని సకలేష్టదాయకుండగు కృతిపతి నన్వేషించునెడ—

"శా॥ శ్రీ మద్దైవ్యభవభావ్య పంకజభవ శ్రీకంధరేంద్రా మరుల్
రోమాంచాన్విత గాత్రులై యెదుట బారుల్ దీర్చి సేవింపఁ ద
త్క్షేమాను గ్రహాయుక్తి లెమ్మనుగతిన్ శ్రీహస్తముల్ జూపు శ్రీ
భామా సక్తుఁడు వెంకటేశ్వరుఁడు స్వప్నప్రాప్తుడై యిట్లనెన్

క॥ వరమతి నుదయించితి మ
ద్వరమున నటుగాన నీవువర్ణించు కృతీ
శ్వరుఁడనయి వరములొసఁగెద
గరిమన్ లక్ష్మీవిలాసకథ జెప్పఁదగున్.

తే॥ అని దయారసదృష్టితో నభయమొసఁగి
కృతి యొనర్పుము నాకు నంకితముగాఁగ
వత్స దీర్ఘాయురస్తు భవ్యగతినీకు
ననుచు దీవించె" నట.

ఆ దేవుఁ డాతని కులదైవంబే గనుక నీతఁడు నానందరస తరంగంబుల నోలలాడుచుఁ దన కులదైవంబగు సద్దేవునుద్దేశించి నమస్కరించి భక్తియుక్తంబుగ లక్ష్మీవిలాసంబను నేతత్ప్రబంధ ప్రారంభ సంరంభుం

డయ్యెనట. ఇట్లీ వ్రాయసము వేంకటపతిచే రచింపఁబడిన లక్ష్మీవిలాస ప్రబంధము శ్రీవేంకటేశ్వరస్వామి స్వయముగ భక్తునడిగికొని కృతినొందిన గ్రంథములలో మొదటిదిగాఁ గనఁబడు చున్నది. కావుననే యీతని స్తుతిరత్నము లిందుఁ జేర్పఁబడినవి.

ఇట్టే పదునేడవ శతాబ్దాదిని కాకమాని మూర్తికిని శ్రీవేంకటేశ్వరస్వామి కలలో నెదుట ప్రత్యక్షమై

" కృతిలోఁ బ్రతిపద్య చమ
త్కృతి గలుగగఁ బలుకనేర్చు కృతిపీవు మహా
కృతిమాకొనరుచు భాషా
కృతిభారవి కాకమాని శ్రీమూర్తికవీ "

అనిచెప్పి యదృశ్యుండయ్యెనట. అంత నాతఁడు

" అవనీశ పిశాచస్తుతి దవులుటగాదని — 'న దైవం కేశవాత్పరమ్మ' ని తలఁచి "

" చెప్పినపద్యమెల్లఁ జెవిఁజేర్చి వినున్వినఁ డొంకుగల్గినం
దప్పులు గిప్పలెన్నఁ డొక నాఁడును నాఁడును నేఁడువేఁడుచో
నప్పననెట్టి పో డడిగినన్ని వరాలిడుఁ గొండ మీఁది తి
మ్మప్పనివంటి కావ్యపతి యబ్బుట యబ్బుర మిబ్బుధాళికిన్ "

అని నిశ్చయించి యా వేంకటాద్రి రాయనికిఁ గృతి ఘటియించినాఁడు. ఆ వేంకటాచలమునుగూర్చి యందలి యుత్సవములనుగూర్చి విపుల వర్ణనలులేకున్నను,

" అప్పప్పచూడ వలదా
యప్పని కోవెలపటీర హైమజలంబుల్
కప్పూరము పునుగు మృగమద
మెప్పట్టున తావిగల్గు భృగుదివసమునన్ "

అని శుక్రవారపు తిరుమంజనమునుగూర్చియు

"బ్రహ్మ తిరుణాళ్లకరుదెంచి ఫలముగాంచు
కటక కల్యాణ ఢిల్లీనికట జనంబు"

అనియు

"వేంకటేశ విశాఖ తీర్థని రీక్షకరుగు
దెంచు నాసేతుకాశి తైర్థిక జనంబు"

అని ఆసేతు హిమాచలమునుండి తైర్థిక జనమిచ్చటికి వచ్చుచుండినట్లు తెలిపి యట్టి శైషశైలంబు పతివంటి దాతదైవంబు గలడే యని చెప్పి యాతని కంకితమిచ్చినాఁడు.

విష్ణుమాయా విలాసకర్త — ఎఱ్ఱగుడిపాటి వేంకటకవి. ఇది బిట్రగుంట వేంకటేశ్వరస్వామి కంకితము. ఈ కవి నివాసస్థానము కడప జిల్లా ఎఱ్ఱగుడిపాడు. ఈ కవి సంతతి వారిప్పటికి నాగ్రామముననున్న వారు. ఉదయగిరి రాజ్యపాలకుఁడగు నరసింహనృపతి కూతురు గౌరమాంబ శ్రీవేంకటేశ్వర పాదారవిందమతి. ఈమె తండ్రివల్ల నెల్లూరు రాజ్యమును బడసి స్వామితీర్థప్రసాదముల నంచెలమీదఁ బ్రతిదినము తెప్పించుకొని స్వీకరించెడిదట. స్వామి యామెను బరీక్షింపఁదలచి మహోత్పాతంబులతో నీమె పట్టమున వారమురోజులు కుంభవృష్టి కురిపించినాఁడు. ఏడు దినములు నీమె యుపవాసముండి దీక్షతో స్వామిని భజించి సాక్షాత్కారమును బొంది, యాతనిని బిట్రగుంట వేంకటేశ్వరుడను పేరుతో నచ్చట వెలయించినదట. విష్ణువు తన విలాసములచే బ్రహ్మ, శివనారదాదులను మోహింపఁజేసిన కథలిం దతిచమత్కారముగా వర్ణింపఁబడినవి. ఈ కవియు 17-వ శతాబ్దివాఁడు గావచ్చును.

వాణీవిలాసరచయిత — పేకుమళ్ళ రంగశాయికవి

ఈతనిది శ్రీవత్సగోత్రము. తండ్రి కప్రయామాత్యుఁడు. తల్లి

తిమ్మమ్మ. ధర్మపురి శ్రీ నృసింహవరప్రసాది రామభద్రుఁ డీతని గురువు. ఈ వాణీవిలాసము సర్వవిషయసంగ్రహ మనఁదగిన యొక బృహద్గ్రంథము. శ్రీతిరుపతి వేంకటేశ్వరస్వామి కంకితము. స్వామియే యుషఃకాలమున స్వప్నమున సాక్షాత్కరించి గ్రంథమును దనకు సమర్పణము చేయుమని యడుగఁగా నాతని కర్పించినాఁడు కవి. ఈతఁడు క్రీ. శ. 17-వ శతాబ్దివాఁడు గావచ్చును.

## శ్రీకృష్ణవిలాసకర్త — చల్లపల్లి వెంకనార్యుఁడు

ఈతఁడు మౌద్గల్యగోత్రజుఁడు. రంగామాత్యపుత్రుఁడు. తల్లి ఓబమాంబ. ఈతఁడు స్తుతించిన పూర్వకవులలో తెనాలిరామకృష్ణుఁడు నుండుటచే నీతడు క్రీ. శ. 17-వ శతాబ్ది తరువాతివాఁడు గావచ్చును.

"నీ కావ్యాంకితమిమ్మటంచుఁ గృపతో నా యిష్టదైవంబు దా నాకాంక్షింపుచు వెంకటేశ్వరుఁడె డాయన్‌వచ్చి వేడన్! భళా నాకో ర్కెల్ సమకూరె"నంచు నీగ్రంథమా దేవునికి గృతియిచ్చుచు రచించెను.

## శ్రీనివాస విలాస సేవధి - కృతికర్త: శ్రేష్ఠలూరి వెంకటాచార్యుడు

ఈతడు భరద్వాజ గోత్రవర్ధనుఁడు. ఆపస్తంబసూత్రానువర్తి. అష్టభాషాకవితార్జితప్రోద్యదష్టావధాన విఖ్యాతవైభవుఁడు. శ్రీ కృష్ణయార్య లక్ష్మీగర్భవార్థి రాకాసుధానిధి రాజపూజితుడు, వివిధ విద్యాశాలి వెంకటాచార్యుండు.

శ్రీ వేంకటేశ్వరుండు కలలోఁ గానిపించి, బహు పురాణోక్తి సంబంధంబువలన గహనమై పెనుగొన్న తన కథలోని చిక్కును దీర్చి రత్నమునకు మెఱుఁగుపెట్టునట్లు రచింపుమని వేడెనట. కావున నీ శ్రీనివాసుని పురాణ కథలలోఁగల పూర్వోత్తర విరోధములను సవరించి తా నీ కథ రచింపఁగడఁగెనట. ఈతఁడు 18-వ శతాబ్దివాఁడు గావచ్చును.

## మధురవాణీవిలాసకర్త — చింతలపల్లి వీరరాఘవకవి

శ్రీ వేంకటేశ్వర వరప్రసాదలబ్ధ కవితాచాతురి గలవాఁడు. ఆశ్వలాయన సూత్రపవిత్రుఁడు. వీరరాఘవ పౌత్రుడు. వెంకటార్యపుత్రుఁడు తల్లి లక్ష్మమాంబ. చిత్రకవితావినీత నానావిధావధాన లాఘవుడు. వెంకటనాయక నాటక వేషధారి హరి కలలోఁ గానవచ్చి యొక ప్రబంధము క్లిష్టకల్పనగాకుండఁ దనపేర రచింపుమని ప్రబోధించినాఁడు. ఈతని వంశ మేడుతరములు కవితల్లజులలోఁ గూడినది. ఈతని తాత మట్ల యనంతభూపాలుని మన్ననలఁ బొందినాడట. ఈతని యార్గురు పుత్రులును కవులే. స్వామి సుదర్శనాంశమున జనించిన కార్తవీర్యారునుని కథ యిందు వర్ణితము.

## వేంకటేశ్వరవిలాసకర్త : చెళ్ళపిళ్ళ నరసకవి

ఈఁతడు భారద్వాజసగోత్రుఁడు. ఈ కవి సుమారు 150 సం॥ ములకు బూర్వమున నుండినవాడు. కాకరపర్తి వేదుల వెంకటార్యు లీతని గురువు. మేలుకోట చెల్వపిళ్ళరాయుని సాక్షాత్కారమును బొంది యాతని భక్తులగుటచే, భారద్వాజసగోత్రజులు కొందరు చెల్వపిళ్ళవారైరట. ఈతని తండ్రిపేరు కామయ్య, తల్లిపేరు వెంకమ్మ. ఈతఁడు శ్రీరామపాదారవింద సేవారతహృత్సారసుడు. ‘ యామినీపూర్ణతిలకా విలాసం ’ బను కావ్యమును రామాంకితంబొనర్చినాఁడు.

గౌతమీతీర “ కంకణగ్రామ ” ( కడియము ) నివాసి. పద్మనాయక విభూత్తముఁడగు చింతపట్ల వేంకటరాయ నృపాలమౌళి గారవించిన కవి. ఏకప్రాస కంద గోపాలశతకము అను శతకమును అహల్యాసంక్రందన విలాసము, ఏకాంతసేవా కలాపము అను యక్షగానములను రచించినాడు. ఈ రెండవ యక్షగానము స్వగ్రామమగు కడియములోని జనార్దనస్వామినిగూర్చి వ్రాయఁబడినది.

## వెంకటాచల మాహాత్మ్యము — తరిగొండ వెంకమాంబ

ఈమె తరిగొండ గ్రామవాసిని. తరిగొండగ్రామము (తరికుండ) కడపమండలములో వాయల్పాడు తాలూకాలో నున్నది. ఈమె మంచి విద్వాంసురాలు. నందవరీక బ్రాహ్మణ స్త్రీ. భర్త నామగోత్రములను తెలుపక, "వసిష్ఠగోత్రపవిత్ర కృష్ణయామాత్య తనూభవ" యని చెప్పుకొనుటచేత, ఈమె బాలవితంతువని తోచుచున్నది. క్రీ.శ. 1840 ప్రాంతమున నీమె జీవించియుండినది. ఈమె రచించిన గ్రంథములు - రాజయోగసారము, శ్రీ రమాపరిణయము అను ద్విపదకావ్యములు. భాగవతము ద్విపద. ముక్తికాంతావిలాసమను యక్షగానము. ఈమె తన గ్రంథములను తరిగొండ నరసింహస్వామి కంకిత మొనర్చినది.

## వెంకటేశ శతక కర్త — తాళ్ళపాక పెదతిరుమలాచార్యులు

ఈతడు సంకీర్తనాచార్యుడని ప్రసిద్ధిగాంచిన తాళ్ళపాక అన్నమాచార్యుల రెండవ కుమారుడు. ఈతడు తండ్రియాజ్ఞానుసార మనేకములగు శృంగారాధ్యాత్మ సంకీర్తనలను రచించి శ్రీ వేంకటేశ్వరస్వామి కర్పించియున్నాడు. వీరి సంకీర్తనలను రాగిరేకులమీద వ్రాయించినవాడీతడే. స్వామి కనేక విధములగు కైంకర్యములను జేయించినాడు. వెంకటేశోదాహరణము, సుదర్శనరగడ, రేఫరకారములు, నీతి సీసశతకము - ఈతని యితర గ్రంథములు.

వెంకటరమణ శతకము రచించినది రత్నమాంబ. ఈమె మంత్రి వంశాంబుధిసోముడు, పెనుమళ్ళగోత్రుడు, రూస్థాన్‌పేట హేమభూపతి పెద్దకొడుకు నగు అనంతభూపతి అర్ధాంగి. శ్రీ వేంకటేశ్వరస్వామి కటాక్షమునుబొంది యాతనియాజ్ఞ ననుసరించి యీశతకమును జెప్పినట. ఈమెకాలమేమో తెలియరాదు. ఐహిక సుఖానుభవములనంది తుదకు వానిని రోసి పరమాత్ముని పాదసేవనే కాంక్షించిన ధన్యురాలు.

## వేంకటరమణ శతకము — రచయిత : పత్రి రమణప్పకవి

ఈతఁడు మాధ్వ మతస్థుఁడు. కౌండిన్యగోత్రుఁడు. విష్ణు సర్వోత్తమ శతకమను మఱియొక శతకము నీతడు రచించెను. జన్మ స్థానము నర్సారావుపేట తాలూకాలోని సాతలూరు. ఈతఁడు క్రీ. శ. 1800 ప్రాంతమువాఁడై యుండును.

అలుమేలుమంగావిలాసము :— కర్త యెవరో తెలియరాదు.

తిరుమల వెంకటేశ శతకము :— రచయిత భగవచ్ఛాస్త్రి. ఆత్రేయసగోత్రజుడు. జగ్గయ్యపేట ప్రాంతమువాడు. 1850 సం॥ మున జీవించియుండెను. గోవిందశతకము, శంకరవిజయము రచించెను.

శ్రీ వెంకటేశ శతకము :— కర్త : ఊడిమూడి సూరపరాజు. ఈతఁడు భట్రాజు. తండ్రిపేరు సూరయ. తల్లి నరసమ్మ. ఈతని గురువు అనంతకవి. తిక్కన, పోతనలను భట్టుమూర్తిని స్మరించి నాడు. గోదావరి మండలములోని జొన్నాడ గ్రామ మీతని కాపుర స్థలము. ఈతఁడు 16 వ శతాబ్ది తరువాతివాడు కావలయును. ఈ శతకములోని పద్యములన్నియు రకారప్రాసముతోఁ గూర్పఁబడియున్నవి.

తిరుమలగిరి వెంకటేశ శతకము :— కర్త : నల్లాంచక్రవర్తుల వెంకటాచార్యులు. కృష్ణాతీరమున ముక్త్యేశ్వరపురము కాపురము. వైష్ణవమత సిద్ధాంత బోధకుడు. 1800 సం॥ ప్రాంతమువాడు.

వెంకటనగాధిప శతకము :— మంచళ్ళ కృష్ణకవి. ఈతఁడు భారద్వాజసగోత్రుఁడు. పాపయ్యామంత్రి పుత్రుఁడు. క్రీ. శ. 1850 ప్రాంతమువాడు.

ఇట్లీ పదునేడవ శతాబ్ది ప్రారంభమునుండి సామాన్యముగా శ్రీవేంక టేశ్వరస్వామి తెలుఁగు కవులకు స్వప్నమున సాక్షాత్కరించి, వారి రచన లను గృతిగొనుచుండుట యొక పరిపాటియే యైనదని చెప్పవచ్చును.

ఏ యితరభాషాకవులను నీతఁ డిట్లు స్వప్నమున సాక్షాత్కరించి తనకుఁ గృతుల నిమ్మని ప్రోత్సహించి నట్లగపడదు. ఏనాడు తిక్కనార్యునకు హరిహరనాథుఁడు స్వప్నమున సాక్షాత్కరించి యాతని భారత రచనను గృతిగొనెనో యానాటినుండియు దెనుఁగు కవులలో ననేకులకు వారి యిష్టముదైవము స్వప్నమున సాక్షాత్కరించి వారు రచింపఁదలచిన గ్రంథమును దాను కృతిగొనుచుండుట యొక పరిపాటియైనది. ఆంధ్ర సాహిత్యమున కీ స్వప్నవృత్తాంతము షష్ఠ్యంతరచన, ఆశ్వాసాద్యంత సంబోధనంబులు ముఖ్యలక్షణములుగా నేర్పడినవి. ఇట్లు శ్రీవేంకటా చలపతి కృతిగొన్న యాంధ్రకావ్యములు పదునారవ శతాబ్దిని కృష్ణ రాయల తరువాత నంతగా గానరాకున్నను, పదునేడవ శతాబ్దినుండి యనేకముగాఁ గానవచ్చుచున్నవి. వీనిలో పెక్కుప్రబంధములె. ఈ పదునేడు పదునెనిమిది శతాబ్దము లాంధ్రసాహిత్యమున ప్రబంధకవిత్వము విజృంభించి, గతాను గతికమై తుదకు క్షీణదశనొందినకాలము. ఈ ప్రబంధములలోఁ బెక్కుపరిణయములు శృంగారకథలు, వర్ణనాత్మక ములు. శతకములును పెక్కుగలవు. దేశిరచనలలో — యక్షగాన ములు, వచనములు, విన్నపములు, దండకములు, ద్విపదలు మొద లగునవి కొన్నిగలవు. అట్టి వానిని గూర్చిన పరిశీలన కిది తావుకాదు. శ్రీవేంకటేశ్వరస్వామికిఁ గృతియిచ్చి యాతనిని గీర్తించిన తెలుఁగు కవుల స్తుతిపద్యరత్నములను భక్తజనాళి కందించి, తన్మూలముగా నాస్వామి సేవాపరతంత్రతను పెంపొందించుటయే దీనిముఖ్యోద్దేశము. ఆంధ్రులపాలిటి పరమదైవమగు శ్రీవేంకటేశ్వరస్వామి ఆంధ్రకవితల్లజుల కవితా మహార్ణవమునుండి యెత్తి కూర్చిన యీ స్తుతిరత్నమాలను గ్రహించి భక్తాళికి సర్వాభీష్టముల ననుగ్రహించుగాక ! ! !



ఓం.

# శ్రీ వేంకటేశ్వరస్తుతిరత్నమాల

## ద్వితీయ సరము

### ౧

### ఆముక్తమాల్యద

### శ్రీ కృష్ణదేవరాయల స్తుతిరత్నములు

ఉ॥ శ్రీకమనీయహారమణిఁ జెన్నుగఁ దానును గౌస్తుభంబునం
దాకమలావధూటియు నుదారతఁ దోఁపఁ బరస్పరాత్మలం
దాకలితంబులైన తమ యాకృతు లచ్చుతఁ బైకిఁ దోఁప న
స్తోకత నందుఁ దోఁచెనన శోభిలు వేంకటభర్తఁ గొల్చెదన్.

సీ॥ నీలమేఘముడాలు డీలు సేయఁగఁజాలు
మెఱుఁగుఁ జామనచాయ మేనితోడ
నరవిందములకచ్చు లడఁగించు జిగిహెచ్చు
నాయితంబగు కన్ను దోయితోడఁ
బులుగురాయని చట్టుపల వన్నె నొరవెట్టు
హొంబట్టు జిలుఁగు రెంటెంబుతోడ
నుదయార్కబింబంబు నొఱపువిడంబంబు
దొరలంగ నాడు కౌస్తుభముతోడఁ

తే॥ దమ్మికేలుండఁ బెఱకేల దండయిచ్చు
లేములుడిపెడు లేఁజూపు లేమతోడఁ
దొలఁకు దయఁదెల్పు చిఱునవ్వుతోడఁ గలఁ ద
దంఘ్రిజలజాతుఁ డిట్లని యానతిచ్చె॥

తే॥ ఆంధ్రభాష యసాధ్యంబె యందునొక్క-
కృతివినిర్మింపు మీకమాకుఁ బ్రియముగాఁగ ॥

ఆ॥ తెలుఁగదేలయన్న ! దేశంబు తెలుఁగేను
తెలుఁగువల్లభుండఁ, దెలుఁగొకండ
యెల్లనృపులు గొలువ నెఱుఁగవే బాసాడి,
దేశ భాషలందుఁ దెలుఁగు లెస్స.

క॥ అంకితమోయన నీ కల
వేంకటపతి యిష్టమైన వేల్పగుటఁ దదీ
యాంకితము సేయు మొక్కొ-క
సంకేతము గా కతఁడ రస జ్ఞే గానే ॥

శా॥ బాలార్కాంశు విజృంభితామలశరత్పద్మాక్ష పద్మాక్షమా
నీలాజాంబవతీశ యీశ బలభిన్నీ కే రుహోద్భూత ది
క్పాలామూల్య శిరోమణిద్యుతి కనత్పాదాబ్జ పాదాబ్జ ఫా
లాలంకారకచావలీ మకర దీప్యత్కుండలాంచన్ముఖా ॥

క॥ జలచర కిటిహరవటు భృగు,
కుల రఘుకుల సీరిబుద్ధ ఘోటిప్రముఖో
జ్జ్వల జనికృత జన రక్షా
యలమేల్మంగాభి ధేందిరాలయవక్షా ॥

క॥ శ్రీనయన కువలయయుగళా
నూన జ్యోత్స్నాయితస్మితోజ్జ్వలముఖ దై
త్యానీత సురశ్రీపున
రానయనక్రమణ వేంకటాచలరమణా ॥

చ॥ యమనియమాది లభ్య, ద్రుహిణాది జరన్మరుదిభ్య, సంసృతి
శ్రమహరనామకీర్తన, మురప్రవికర్తన, పాతకావలీ
దమన, రమాంగనాకమన, తామరసాయతనేత్ర, భక్తహృ
ద్భ్రమ తృణదాత్ర, భూయువతి రంజన, వర్ణజితాభ్రఖంజనా॥

క॥ శ్రీక్షితి నీళావర, దను
జోక్షప్రాణహర, దంష్ట్రికోత్కృత్త హిర
ణ్యాక్ష క్షపాచర, కృపా
వీక్షోద్ధృత బాహులేయ, వేంకటరాయా।

క॥ ఊరీకృత పాండవ రథ
సారథ్య, సయూథ్యగోప శాబకసహకే
ళీరత, భక్తప్రహ్లా
దారచితస్తోత్ర పులకితాంచిత గాత్రా॥

క॥ శ్రీమందిర భుజమధ్యమ,
గోమండల కర్షి వేణుగుంభన, దృప్య
ద్భామాహృత సురజనయి
త్రీమణితాటంక, వృషగిరిస్థ, ఖగాంకా॥

క॥ కరధృత దరారి వితరణ
పరిపాలిత తొండమాన్నృపాలక, పునరు
త్తరిత నరనష్ట బాలక
శరణాగత సేవధీ, భుజంగాశరధీ॥

క॥ శ్రీనీళా జాంబవతీ
మానసతామరస విహార - మాణిమిళిందా

భాసద్యోదయకళిందా
నానాంఘ్రి శిరోక్తి శేషనగహార్యత్రా ॥

ఉ॥ కంధర నీలవర్ణ, మధుకైటభనాగ సుపర్ణ, యోగిహృ
ద్గ్రంథిభిదోర్థ భోగివనితా స్తవనవచ్ఛ్వాసనస్రవచ్ఛిర
స్సంధిప సన్నిశాపతి రసస్రుతి దుగ్ధపయోధి వీచికా
మంథర కేళికాదర, సమాశ్రితపంక్తి శిరోధిసోదరా !

క॥ శ్రీకారి, కృపార్ద్రేక్షణ
వైకుంఠ, యకుంఠ, భక్తవరదపదాబ్జా
స్తోక మరందాయిత గం
గా, కాకోదర నగోదయస్థ పతంగా ॥

క॥ అనవరతనవరతాదృత
వినుత ప్రేమార్తవల్లవీ జనజాలా,
మననపర మౌని మానస
వనవసిత్ర మరాళ వర సువాసితమూర్తి ॥

ఉత్సాహ॥ నలముఖాది చక్రవర్తినాథ నవసమర్పితా
త్యలఘుమకుట ముఖ్య హార్యపాయనా యనావిలా
జిల సురారి హరణ నిజవశీకృతాఖిలాంశ ని
ర్మలగుణా ! యమేయరూప, రంజితార్య పోషణా !

క॥ శ్రీమదు మా సులభాంగక
సామజ హర నక్రదళన చక్రసదాళీ
క్షేమంకర చరణాంబుజ
హైమోజ్వలవాస ! వేంకటాచలరమణా !

ఉ॥ స్కందసరస్తటీరమణ కందర చందన కుందవాటికా
మంద సమీరలోల వనమాలిక నిర్మలదివ్య విగ్రహా
స్పంద విభాధరీకృత నభస్ఫుట కాళిక వల్లవాంగనా
బృంద మనోభిమాన ధృతిభేదన పేశల వంశవాదనా !

క॥ అరిధారా ఖండితమరు
దరిసంఘు, విహంగవాహనా, యుదరమహాం
బురుహ పుటభరిత మధుశం
బర భరజ మానుషాయ మాణదృహిణా ॥

స్రగ్విణి ॥ వాలినిర్భేదనా వారిజాతేక్షణా
శైలకన్యాస్తుతా - శార్ఙ్గచంచద్భుజా
పాలదృక్పద్మభూ పాక భేదిస్ఫుర
న్మౌళిమాణిక్యరు - ఙ్మండితాంఘ్రిద్వయా ॥



౨

## సకల నీతికథానిధానము

కూచిరాజు - ఎఱ్ఱయ

సీ॥ ఆదికాలమున నారాయణాచలమను
నామంబుదాల్చెనే నగవరుండు
త్రేతాయుగంబున శ్వేతాచలంబను
ప్రఖ్యాతిగాంచె నే పర్వతంబు
ద్వాపరంబున శేషధాత్రీధరంబన
పొగడతగాంచె నే భూధరంబు

గీ॥ దేశభాషల నేగిరి తిరుమలనఁగ
కోరికలనిచ్చు జనులకే కొండ తాఁదు
గరుడ నామంబు దాల్చె నే గిరులరాజు
తగదె ప్రస్తుతిసేయ నయ్యగకులేంద్రు॥

అట్టి వేంకటచలాధీశ్వరుండు —

సీ॥ శరభ శార్దూల కేసరిమృగంబుల వేఁట
లాడుచో చంచులఁ గూడియాడు,
వాసంత విభవోత్సవంబుల సతులతోఁ
దెప్పలఁ గోనేటఁ దేలియాడు,
లలిత కన్యామాస కల్యాణదర్శనా
మర్త్య మర్త్యులతోడ మాటలాడు
సతతసేవా సమాగతదేశకులు చూడ
తేరెక్కి పురవీథిఁ దిరిగియాడు

సీ॥ కొలుచువారికిఁ గొలువంగఁ దలఁపుగలిగి
వచ్చువారికిఁ గోరిన వరము లిచ్చి
ఆదరంబున ముచ్చట లాడు వాఁడు
ననుఁగు వెంకటశైల రమాధివరుఁడు॥

వ॥ ప్రత్యక్షంబైన నా కేశవునకు తొండమాన్ చక్రవర్తి సాష్టాంగాలింగితోర్వీతలంబగు దండప్రణామం బర్పించి యిట్లని స్తుతించె—

## తొండమాను చక్రవర్తి స్తుతి

చామరం॥ నమో గదాబ్జ శంఖచక్ర సవ్యబాహు పంకజా!
నమో కృపాకటాక్ష లబ్ధ నాకరాజ్య వైభవా!
నమ స్సమస్త లోకపాల సంప్రశస్త మానసా!
నమోరమాధరాంగనాధినాథ వేంకటేశ్వరా!!!

ఆ॥ కటమనంగ బాపకాష్ఠంబు నెంబన
దిహాన నామమయ్యె ద్రవిడభాష
బాపకటము వెంబ భస్మంబు సేయుట
వెంకటాద్రి యనఁగ వెలసెఁ బేరు॥

చ॥ కటములు జేవురింపఁ జెలిగన్నుల వాఁచుదయింపఁ బాద సం
ఘటన సలంగఁ గోరికలు గాంచెదమంచును దీర్ఘయాత్రకై
యిటునటు లేగనేల నరులెట్టి యఘాత్మకులైనఁ గల్గు వెం
కటమను పేరు జిహ్వాతుదిఁ గాపురముండిన ముక్తిసంపదల్॥



3

# లక్ష్మీవిలాసము

## రాయసము వేంకటమంత్రి

శా॥ శ్రీలన్ మించు రమావిలాసమతి మైత్రిన్ జిత్తకంజంబునన్
దాలెఖ్యాకృతిఁ గాంచి చొక్కు రుచి బాహ్యంబందెనాఁ బేరెదన్
లాలిత్యంబులు చూపు సింధుజ నవేలక్రీడలం దన్వునా
లీలాబ్రహ్మము శేషశైలపతి బాళిం బ్రోచు మమ్మెప్పుడున్.

సీ॥ భాస్వదుత్పల హీర ప్రకటదృగ్గరిమతో
దృఢతటిద్భాన దేహ దీప్తితోడ
గురుజీవనగ్రహ కుండలరుచులతోఁ
బటుసువర్ణవిచిత్ర పటముతోడ
విమలముక్తాహార విభ్యమండనముతో
శ్రీవరనామ సంసిద్ధితోడ
దశసహస్రారాబ్జయుత కరక్రీడతో
విపులాభరణ కళావృత్తితోడ

తే॥ నాత్మవిలసనపతి యూధి నతిశయిల్లు
నిందిరాదేవి హృదయారవింద పీఠిఁ
దిరముకొనఁ జొక్కు వేంకటాధిపుఁడు మమ్ముఁ
బూర్ణసకలేష్టదాయియై ప్రోచుఁగాత ॥

శా॥ శ్రీమద్వైభవభావ్యపంకజ భవశ్రీకంధరేంద్రామరుల్
రోమాంచాన్వితగాత్రులై యెదుట బారుల్ దీర్చి సేవింపఁ ద
త్క్షేమానుగ్రహాయుక్తి లెమ్మనుగతిన్ శ్రీహస్తముల్ సూపు శ్రీ
భామాసక్తుఁడు వేంకటేశ్వరుఁడు స్వప్నప్రత్యక్షుఁడై యిట్లనున్॥

క॥ వరమతి నుదయించితి మ
ద్వరమున నటుగాన నీవు వర్ణించు కృతీ
శ్వరుఁడనయి వరములొసఁగెద,
గరిమన్ లక్ష్మీవిలాస కథఁజెప్పఁదగున్.

తే॥ అని దయారసదృష్టితో నభయమొసఁగి
కృతి యొనర్పుము నాకు నంకితముగాఁగ
వత్స దీర్ఘాయురస్తు భవ్యగతి నీకు
ననుచు దీవించె నంత నే నద్భుతముగ.

క॥ మేలుకొని స్వప్నలబ్ధపు
మేలు సుధీజనులతో నమృతసారరుచుల్
జాలుకొనఁ దెల్ప నెన్నఁగఁ
జాలు కృతార్థుండ ననుచు సంభ్రమపరులై.

మ॥ చతురోక్తిన్ ననుజూచి యిట్లనిరి వత్సా నీవు గావించు స
త్కృతి శ్రీవేంకటభర్తకీఁగనుట యెంతే పూర్వజన్మాంతరా
ర్జిత పుణ్యంబునఁగాక కల్గునె యశశ్శ్రీకై హికాముష్మిక
స్థితికర్తం గృతి భర్తఁజేసి కను మస్థేమాయురారోగ్యముల్.

ఉ॥ వ్రాయుదు రాజ్యవైభవధురంధర భూతి దలిర్పఁ గీర్తి ధౌ
రేయు సిరంగరాయ మహిభృన్మణి రాయస మగ్రహార హే
మాయత రత్నభూషలు నృపాఢ్యులు వర్తనలీయ నుబ్బుచున్
వేయన నేమి రాయసము వెంకట మంత్రియనా యశస్వినై.

క॥ ఈలీల నెసఁగి విభవా
వాలంబగు వెంకటాద్రి వల్లభుకరుణన్
శ్రీలం జెలొవ్వొందుచు ధర
నాలక్ష్మీరమణు గుణాను లభివర్ణింతున్.

శా॥ చంగత్తుంగపతద్ఝరీ తటనటచ్చక్రాంగ రంగద్దరు
ద్యాంగేయ ద్యుతిపుంజరంజిత దరీధాతు ప్రభాప్రేడితే।
శృంగే పన్నగ రాణ్ణగస్య రమయాక్రీడంత ముద్వాంఛయా
శృంగారాంగద సంగతాంగ మనిశం శ్రీవేంకటేశం భజే॥

సీ॥ వికచ పంకజ గళన్మకరందలీలఁ బూ
ర్ణకటాక్షములఁ గృపారసముఁజెంద,
మృదులప్రవాళ బింబిత సముద్యుతివోలి
యధరంబుపై మందహాసమమర,
హృదయనిర్యత్సంగతేందు బింబవిభూతి
సుభగ వక్షమునఁ గౌస్తుభమెసంగ,
దళితకోకనద సమీకృత రథాంగస్ఫూర్తి
చరణాప్తరత్న హంసమ్ములొలయ

తే॥ సరస సంజాత సురనదీఝరి వికాస
పూరితాంగుష్ఠ నఖకాంతి ధారనిగుడ
శ్రీసమాహితమూర్తియై సిరులఁదనరు
వాని శ్రీవేంకటాచల స్వామిఁదలతు.

మ॥ తను సేవించు జనాళికింగరుణ నిద్ధాత్రిన్ మనోవాంఛ లె
ల్లను బూరింతునటంచు లోకులకు నెల్లం దెల్పఁ బ్రత్యక్షమై
జన సంఘంబుల నిందురమ్మనుచు నోజంబిల్చునట్లాశ్రితా
వనహస్తాబ్జముఁజూపు వెంకటనగస్వామిం బ్రశంసించెదన్.

మ॥ పగలుం రే లొనరించు గందళులకున్ భావింపుచున్ సుప్రస
న్నగతిన్ భక్తమనో మహోత్పలము లానందింపఁ జంచత్కృపన్
బగలున్ రేలన కీప్సితంబు లొనగూర్పంజాలు నా శంఖ చ
క్రగదానందక శార్ఙ్గహస్తు ధుతరాగగ్రస్తుఁ గీర్తించెదన్.

క॥ శ్రీనయనోత్పల సితకర
దానవ నిగృహీత భూత ధాత్రీఘనరా
దానవల చరణచరణా
జ్ఞానత మహీ వలయ వేంకటాచలనిలయా.

ఉత్సాహ॥ కలహకీలక విధిబాలక నుతశీల! పద్మినీ
దళవిశాల నయన! తాళధారిఖేల! దోర్బలో
చ్చలితశైల! జలదనీల! స్వర్ణచేల! వర్ణని
ర్మల కపోల ఫలకలోల! మకరలీల కుండలా!

క॥ శ్రీరమణీ రమణీయ వి
హారోచిత హారయుత భుజాంతర! పవనా
హారి ఫణా ఫణ నర్తన!
హారి పదక్రమణ! వేంకటాచల రమణా!

మ॥ స్ఫురదష్టాపదనేత్ర! నేత్రరుచి సంతుష్టాంబురుట్పత్ర! ప
త్రరథేశస్తుతిపాత్ర! పాత్ర భువన భ్రాజత్సుధీమిత్ర! మి
త్రరుగంచత్కటిసూత్ర! సూత్రరచనా ప్రాగల్భ్యవాగ్గోత్ర! గో
త్రరిపు శ్రీవనచైత్ర! చైత్ర రథనాథత్రాణ విశ్రాణనా!

తురంగ॥ బాలాగూహన! లీలామోహన! భద్రవినిద్ర! సముద్రనివాసా!
శైలోద్ధారణ! శీలావారణ! శౌరి! మురారి! దరారి విలాసా!
నాళీకోదర! కేళీ నారద! నాదవినోద! పయోద వికాసా!
కాళీయావన! పాళీభావన! కామసుధామ! సుధామయవాసా!

క॥ శ్రీకర! రిపుభీకర! సుగు
ణాకర! వత్సాపహరణ హాహాంచిత మా
యా కలన చతుర తర ర
త్నాకర వినివేశ! వేంకటాఖ్యగిరీశా!

మ॥ అవికారప్రతిభా ! కృపారసప్రవృత్తాపాంగ ! తాపాంగనా
ద్యువ తిప్రార్థిత సువ్రతాంగ కృతసాంగోపాంగ ! గోపాంగనా
ర్జవ సౌందర్య ముఖాబ్జలో లుపమనస్సారంగ ! సారంగ బం
ధ విముక్తిప్రథితత్పరా ! విలసనద్వామాంగ వామాంగజా.

క॥ శ్రీవనితాకుచకుంభ
ప్రావృతమృగనాభి సౌరభాసక్త మనో
భావుక ! శుభదాయక ! క్రీ
డావిపుల కటాక్ష ! వెంకట నగాధ్యక్షా !



౪

# విష్ణుమాయా విలాసము

ఎఱ్ఱగుడిపాటి వేంకటకవి

ఉ॥ శ్రీయలమేలు మంగనెదఁ జెన్నుగఁదాల్చి మహానురక్తిచేఁ
బాయక భక్తలోకముఁ గృపారసవీక్షణ సంప్లుతాత్ములన్
జేయుచు బిట్రగుంట నివసించిన వేంకటభర్త నవ్య కా
వ్యాయుత వాగ్విలాస మహిమాతిశయంబులఁ బ్రోచుగావుతన్.

సీ॥ ఇచ్చలో శ్రీవేంకటేశ్వర పాదార
విందసందర్శనావేశ గరిమ
సతతంబు హరినామ సంస్మరణానంద
పరిపూర్ణ మానస పరవశతయు
ననవరతంబు నారాయణ శుభకథా
కర్ణనోత్పాదిత కౌతుకంబు
నిరతంబు వైష్ణవ నియత సంతర్పణా
పరిమితోత్సాహ సంభరితహృదయ

తే॥ మలర నిత్యంబు వేంకటాచలమునందు
నుంచి తీర్థప్రసాదంబు లంచ లంచ
లాని కొని తేరఁగైకొను టాత్మనియతి
గాఁగ గౌర మహాదేవి ఘనత మెఱసె.

సీ॥ బాల భాస్కరశత ప్రభగల మకుటంబు
నవరత్న మకరకుండల యుగంబు
ఖండేందునిభ ఫాల కస్తూరితిలకంబు
దరహాసకలిత సుందరముఖంబు

రంగైన యలమేలు మంగ యొప్పెడుతాళి
గ్రైవేయభాసుర కౌస్తుభంబు
కటి వాన శంఖచక్రములు హస్తంబులు
నతులితకాంతి పీతాంబరంబు

తే॥ చకిత నవరత్న మంజీర చరణయుగము
హార కేయూర మణి నూపురాది భూష
ణాంచితంబైన నీల నీలాంబుదాగ
మలర నిల్చెను వేంకటాచలవిభుండు.

తే॥ వేదములునాల్గు మూర్తీభవించి చేరి
సన్నుతింపంగ, వేల్పులు చదలఁబుష్ప
వృష్టి కురియంగ సన్మునుల్ వినుతిసేయఁ
దూర్ణముగ మింట దేవ దుందుభులు మ్రోయ.

కని యద్భుతానంద కందళిత హృదయారవిందయై సాష్టాంగ దండ ప్రణామంబు లాచరించి, పులకాంకురిత శరీరిణియై, కరకమలంబులు ముకుళించి, యిట్లని స్తుతియించె.

సీ. అలమేలు మంగాంగనాత్మాంబుజానంద!
యజ్ఞాంశ! శ్రీధర! హరి! ముకుంద!
కృష్ణ! దామోదర! కేశవ!
గోవింద, నుతపద్మజాది సన్మునిబృంద,
రాజీవలోచన రక్షితముచికుంద
సంతతకల్యాణ నందితపద!
విహగేంద్రవాహన! వేదలతాకంద!
యభయప్రదాన! హస్తారవింద!

తే॥ దేవదేవ! జగన్నాథ! దీనబంధ!
భాగ్యహార పుత్రవత్సల భావనంద!
దశన నిర్జితశృంగార తరుణకుంద!
సతత నివసిత వేంకట శైలకంద!

సీ॥ పరమాత్మ! సర్వేశ! వరద! హృషీకేశ!
కరుణా రసాపాంగ! కలుషభంగ!
సద్భక్త మందార! సాధుజనాధార!
నిరుపమాలంకార! నిగమసార!
గోవర్ధనోద్ధార! గోపికాజనజార
సర్వాంతరావాస! సద్విలాస!
స్మరకోటిలావణ్య! సర్వలోకశరణ్య!
నిఖిలమాయాతీత! నిరతపూత!
తే॥ తామరసపత్రనేత్ర! సంతతపవిత్ర!
భువన నిర్మాణసంకల్ప! భోగితల్ప
సర్వసుందర సుఖరూప! శార్ఙ్గచాప
సరసదరహాస! వేంకటశైలవాస!

ఉ॥ కంటిని మత్తపఃఫలము, గంటిని ముంగిటి కామధేనువున్
గంటిని మూలపెన్నిధిని, గంటిని గేళివనీ మరాళమున్
గంటిని కొంగుమేల్పసిఁడిఁ గంటిని దంగెటిజున్ను నిన్ను నే
గంటిని వేంకటాధిపతిఁ గన్నులపండువుగాను సమ్మతిన్.

మ॥ నినువర్ణింపఁగలేరు బ్రహ్మముఖరుల్ నేనెంతయున్ మానిసిన్
ఘనకామాది నిషేధదుర్గుణ గణాక్రాంతన్ మదస్వాంత, గాం
తను, నేనీకరుణాకటాక్షరస సద్ధారాళధారాభి షే
చనఁ బూతాత్మకనైతిఁ జాలదఁటెనిచ్చన్ గోర్కులింకేటికిన్.

కం॥ భవదీయపాద భజనో
త్సవ మింతియొకాని, వేరెసత్ఫల మొకటిన్,

వివరింప మదినీఁదోఁచద
యవిరళమగు కరుణనొఁసగుమయ్య ముకుందా!

సీ॥ అనవిని శ్రీవేంకటాధీశుఁ డిట్లనె
మంచిదీ మగువ నీమానసంబు
నీభక్తిమెచ్చితి నీవుగోరినకోర్కె
కరుణనిచ్చితిని నిక్కంబువినుము
నావచనముఁ గొన్నినాళ్లిటఁ బతిఁగూడి
బహుభోగభాగ్య సంపదలఁబొదలి
యంతట నపవర్గమందెదు నందాక
మద్భక్తినతిలోక మాన్యవగుచు.

తే॥ వర్తిలుమునిందుఁ గేశవమూర్తియందు
బూర్ణముగనాదు నిర్ణయంబుగను నుందు
సంతతంబును దీర్ఘప్రసాదములను
గైకొనుచునుండు నాదుకైంకర్యనియతి.

మ॥ అని యిట్లానతియిచ్చి వేంకటవిభుం డక్కేశవస్వామి యం
దనుమోదంబున నావహించె భువనవ్యాపార పారీణతన్,
దనుదివ్యుల్ మనుజేశ్వరుల్ ముదముతోనన్ గొల్వఁద్రైలోక్యమో
హనలీలన్ దగి వేంకటేశుఁడను విఖ్యాతిన్ జగద్భర్తయై.

శా॥ పూర్వుండెల్ల మహాప్రపంచములకున్ బుట్టింపరక్షింపదా
సర్వంబున్ విలయింపఁ గర్తయితఁడే సంకల్పమాత్రంబునన్
నిర్వాణ స్థితుఁడాద్యుఁడచ్యుతుఁడు వానింగాని దొడ్డుండునే
సర్వం విష్ణుమయం జగత్తనెడి శాస్త్రంబుల్ వినన్ గ్రొత్తలే.

క॥ సకలమును విష్ణుమయమగు
సకలమయుండగును విష్ణుసర్వజ్ఞత వే
రొక వేల్పునందుఁ గలదే
ప్రకటింపఁగ సర్వలోకపాలురయందున్.



ఓం

# వాణీవిలాసము

తేకుమళ్ల రంగశాయికవి.

శా॥ శ్రీవిశ్వంభర లాత్మపాదసదురస్సీమోరు పీఠంబులన్
తివిల్ మీరఁగ శంఖచక్రముని వాణీనాథముఖ్యుల్ నతుల్
గావింపన్ శుభదాధిక ప్రభలచేఁ గల్యాణ వద్వేంకట
గ్రావాధ్యక్షత బాల్చువేల్పుఁ గొలుతున్ గైవల్యసంసిద్ధికిన్.

సీ॥ వరనీలచికుర శైవాలజాలంబున
నిందితవదన పూర్ణేందు విభవ,
మతుల విశాలతరాక్షిమీనంబులు
కమనీయదంత ముక్తాఫలములు,
సులలిత దరహాస శుభ్రడిండీరంబు
మధురాధరామృత మహితసుధయు,
కలితత్రిరేఖా ప్రకాశిత గళధర
మామోద పృథులకుచాచలములు

తే॥ మానితోజ్వల జంఘికామకరములను
లీలదళుకొత్తు పాదప్రవాళలతిక
లమరగాంభీర్య గతిజనకానురూప
మహిమనుప్పొంగు నలమేలుమంగఁగొలుతు.

చ॥ తనుభజియించు శేషునిలఘార్ఘుణ భృద్వరరూపమొందఁగా
దనిలునివాధుచే నోధవుపట్టు లొప్పి రమానఖుండను శ్రీ
వనిత తపంబుమెచ్చి నుతవైఖరి వక్షమునంభరింపు భ
క్తనికర సౌఖ్యదాయి యనఁగాఁదగు వెంకటనాథుఁ డయ్యెడన్.

సీ॥ అంజనాధర గరుడాహార్య వృషశైల
నారాయణాద్రి కనకశిఖరులు,
నీలాద్రి చింతామణిగిరి వైకుంఠాద్రి
వారాహ వృషశైల మేరుగిరులు
సింహాద్రితీర్థాద్రి శేషాద్రిపుష్కరా
చల వేంకటాద్రులు నెలమి శ్రీని
వాసాది శ్రీశైల వాసుని జ్జలగుణ్యా
కృతనామములు (గల్గు) కోట్లకొలది

తే॥ కడఁగి పాతకచయములు గ్రాఁచు కతన
నమృతమైశ్వర్యమైనొసగు నందువలన
వెంకటాచలనామంబు వెలసె మిగుల
నచటఁగల్గు ప్రధానతీర్థాళివినుఁడు.

తే॥ స్వామిపుష్కరిణియు స్కంధధారచే దేవ
తీర్థపాపహరణ తీర్థములను
దురితదూరమైన తుంబురుతీర్థమా
కాశగంగయునఁ బ్రకాశకములు.

క॥ ఇవిమొదలుగ శుభతరవా
ర్యవిరళ సార్థత్రికోటి యగుతీర్థములన్
నవకాంచన తరుకుసుమో
ద్భవగరిమన్ మేరుసమతఁ దద్గిరియమరున్!!

క॥ విరివియు నిడివియు బొడవును
తిరమొప్పఁగనేడు నెనబదియునాలుగురెం
డురుతర యోజనములచే.
నిరవొందున్ వర్ణ్యభావ మొప్పఁగ నయ్యె!!

క॥ శ్రీవేంకటగిరి మహిమం
బావేలుపుఁ బెద్దయైన నభినుతిసేయన్
గావెరవెఱుఁగండెంతయు
శ్రీవైకుంఠంబె యదివిశేషఫలదమై!!

సీ॥ మున్ను శ్రీవైకుంఠమున కేగినారదుం
డటనుండి క్రమ్మరనరుగుదెంచి,
తనకెదురైనట్టి మునికదంబముఁజూచి,
వినుఁడు రమాసఖుండనఘమూర్తి
దేవుఁడు వైకుంఠ దివ్యవిమానాధి
రూఢుఁడై విరజయె రుచిరసరసి
గతిఁదన్ను భజియింపఁగా శేషగిరిమీఁద
నున్నవాఁడని తెల్పవిన్నయట్టి
తే॥ సనకశుకవామ దేవాది సంయమీంద్రు
లుత్సవంబున నటకేగి యుచితరీతి
నాజనార్దను భజియించిరట్టి విష్ణు
సేవ లిహపర సౌఖ్యశుభావహములు.

క॥ గంగాది దివ్యతీర్థము
లంగజహరముఖ్య దేవతావళితచ్చై
లాంగణమున వసియించు సు
సంగతి హరిపాదభజనఁ జరితార్థకమై!!

శా॥ క్షీరాంభోధిజనించియుంచితతప శ్రీవేంకటాధీశ్వరున్
గారాబంబునఁ బెండ్లియాడుటకునై కల్యాణపద్మాకరో
దారాంచత్తట కుంజపుంజవిలసత్స్ఫాటీర వాటీకుటీ
వారాధారసు గంధబంధురతనువ్యాపార హేలాగతిన్.

క॥ వలనగు నలమేల్మంగను
కలుముల చెలిఁ బెండ్లియాడి కంజభవాత్మున్
దలరుంచెలువగు సొబగున
నిలపై కల్యాణ వేంకటేశ్వరుఁడనఁగన్ !!

పంచ ॥ విరించి వాసవాది వంద్య వేదవేద్యభూవరా
చరాచర ప్రపంచ గర్భసర్వలోకసాదరా
కరారవిందకీలిత ప్రకాశకాండ సుందరా
పరాపరేశ వాసితాహి పర్వతాగ్రకందరా.

తోటకం॥ జనకామిత కామితకారణకా
ననవారణ నాగవనాదరణా
అనపాయకృపాసునయాతినయా
వినతాజనతాధిప వెంకటపా॥

తరళ॥ కలశసంభవ సత్తపోఫల కారణార్తి నివారణా
విలసితాననపద్మపద్మనివేశి సీప్సితపూరణా
బలరిపుస్తుత నిత్యసేవిత పన్నగామరచారణా
జలజలోచన వెంకటాచలసద్మసంస్థిరధారణా.

మ॥ శరదంభోరుహ పత్రనేత్రకలుషాచారాసురారీ శవి
స్తరశైన్యాటవివీతిహోత్ర దివిషత్పాదామల జ్యోత్స్నశం
కరయక్షోరగసిద్ధసాధ్యముని సంఘస్తోత్రదారిద్ర్యశం
బరసుశ్యామలవర్ణగాత్ర యలమేల్మంగాకళత్రా! హరీ!



౬

# శ్రీ కృష్ణవిలాసము

చలాపల్లి వేంకనార్యుడు

శా॥ శ్రీ రమ్యంబగు దివ్యవక్షమున రాజీవాక్షి నన్మేలు మం
గా రామామణిఁ గామనీయకఖనిన్ గారామునందాల్చి భ
క్తారామోన్నతి శేషశైల శిఖరాగ్రానర్ఘ్య మాణిక్య గే
హారూఢస్థితిఁ బొల్చు వేంకట నగాధ్యక్షుం బ్రశంసించెదన్.

సీ॥ నిజ నివాసీకృత నేత్ర వక్షోరంగ
వేణీరుచినిర స్త విపులభృంగ
ముఖరమాదలిత సంపుల్ల పద్మకుడుంగ
నాశ్రిత భక్తలోకాంతరంగ
చిరద యావర్షపోషితనంఘ్రి సారంగ
కుచయుగాధఃకృత గురురథాంగ

గీ॥ సురుచిరాలోకవిజితకాతరకురంగ
తనుభవదనంగ శుభవిభాషుర నిజాంగ
కృతహిత స్మయభృంగ మోహితనిజేశ
మంజులాపాంగ నలమేలుమంగఁ దలఁతు.

శ్రీ మద్వేంకటేశ్వర శాశ్వత కరుణాకటాక్ష వీక్షణా పరంపరా సంపత్సంభూత భాస్వత్సారస్వతాతిశయంబున నేనొానర్పం బూనిన మహాప్రబంధ నాయకారత్నం బే మహానుభావుండని నిజభావంబున దలంచుచుండు సమయంబున...

సీ॥ కోటిభాస్కరదీప్తి కోటీర కోటర
స్థగిత సన్మణి ధగద్ధగలవాఁడు
స్నిగ్ధముగ్ధ ప్రభాదుగ్ధదిగ్ధకపోల
చలితకుండల చకచ్చకలవాఁడు
పద్మపద్మద్యోత సద్మసద్మాన్య వ
క్త్రస్మిత లవధళద్ధళలవాఁడు
నవ్య విద్యుద్విభా భవ్య దివ్యాంబరాం
తిమసముద్ధత ధిగద్ధి గలవాడు.

గీ॥ మచ్చకంటియు మచ్చయు మణియుగల్గు
పేరురమువాఁడు జిగిఁగప్పుమీరువాఁడు
శంఖచక్రాదిక చతుర్భుజములవాఁడు
ధన్యుఁడొకఁడుకలను బ్రత్యక్షమయ్యె.

క॥ ఈతీరున గనుపట్టిన
యీతఁడు మాపాలి వేంకటేశ్వరుఁడౌనా
నీతరి నితనిం గనుట పు
రాతన నిజభాగ్యమనుచుఁ బ్రణామిల్లుటయుఁ

గీ॥ మ్రొక్కి సద్భక్తిఁబొగడుచు మోడ్పుకేలు
నెన్నొసటనుంచి నిలుచున్న నన్నుఁజూచి
ముద్దుమోమున చిరునవ్వు మొలకలొత్త
దీవన యొనర్చి యాదేవదేవుఁ డనియె.

గీ॥ వత్స నాపేరఁబరగిన వాఁడ వీవు
నాదు మహిమను గలిగిన నవరసాను
బంధ బంధుర కావ్య నిబంధన ప్ర
భావ మిపుడుర్వి నెగడింపఁ బరఁగుటొప్పు.

శా॥ అశ్రాంతోజ్జ్వల వాగ్విలాసమున సేయంబూని యున్నట్టి యీ
నీ శ్రీకృష్ణవిలాస కావ్యమునకున్ నే నేతనై నన్ భువిన్
విశ్రాంతస్థితిఁ బర్వ నీ కృతి జగద్విఖ్యాతమై శాశ్వతం
బై శ్రీమీరుదుపీవు సౌఖ్యములతో నారోగ్య భాగ్యంబులన్.

శా॥ నీకావ్యాంకిత మిమ్మటంచు కృపతో నీయిష్టదైవంబు దా
నాకాంక్షింపుచు వేంకటేశ్వరుఁడె డాయన్వచ్చి వేడన్ భళా
నీకోర్కెల్ సమకూరె నీదు కృతియున్ విఖ్యాతమై భూమిలో
నాకల్పస్థితి గాంచె రంగ విభువెంగా ! యెంత ధన్యుండవో ?

శా॥ వాల్లభ్యంబున వేంకటేశ్వరుని కావ్యస్వామి గావించి నీ
వెల్లతోఁ గోమల వాగ్విశాల కవితా విద్యావిలాసంబునన్
సల్లాలిత్యముమీర సత్కవులు మెచ్చన్ కావ్యమున్ జేయవే
చల్లాపల్లికులేంద్ర వెంకన సుధీచంద్రా కవీంద్రాగ్రణీ.

క॥ తన పలుకు లెట్టివైనను
ఘనుఁడా వేంకటవిభుండు కాంక్షించి వినున్
చినచిన ముద్దులపలుకులు
తన పుత్రుఁడు బల్క విను తండ్రియుపోలెన్.

మ॥ వనజాతాసన వాసవాది దివిజవ్యాసాది మానీశ్వరా
నన కంజాత వినిర్గతస్తుతి పరామ్నాయోక్తి గాంభీర్యముల్
విను శ్రీ వెంకటనాథుఁ డాత్మవచనాళిన్ వే వినంగోరుటల్
గనుగొన్నన్ నిజనిత్య భక్తజన సౌలభ్యంబుగా నిచ్చుటల్.

క॥ శ్రీరమణీ శ్రితరమణీ
యోరస్థల సుస్థలాంచితోద్యదహోయా
శ్రీరంజిత కౌస్తుభమణి
హారాద్యాభరణ వేంకటాగమ రమణా.

క॥ నిజశుభ కీర్తి నిరాకృత
రజనీధవ హారహీర రజతాద్రివరా
భుజబల నిర్జిత మానవ
భుజ భుజగాశనలలామ భుజగాద్రిచరా.

క॥ శ్రీమత్ప్రతిపద వినతి
స్తోమసమాసక్త భక్త శుభగుణ కరుణా
రామాత్మజాస జలద
శ్యామ తనూధామ వేంకటాచలధామా.

క॥ హరి శిఖి దండ ధరా శర
వరుణానిల యక్షపతి శివాద్యష్టదిగీ
శ్వర సిద్ధ సాధ్య విద్యా
ధర కిన్నర నిరత ఫణిత తాపస గణితా.

క॥ నరనుతచరితా విలసిత
పరమచరణ కమలజనిత పావన జలకా
నిరుపమ ఘృణావలోకన
ధరణి భరణ కరుణానిపుణ దర్పకజనకా.

తోటకం॥ పరమ స్ఫురణా వరభవ్యగుణా !
ధర చక్రధరా నత తాపహరా !
ఉరు సౌఖ్యయుతా ఘన యోగినుతా
సుర సేవ్యపదా పరిశుద్ధ రదా.



౭

# శ్రీనివాస విలాససేవధి

శ్రేష్ఠలూరి వెంకటాచార్యులు

ద్విపద॥ ఇంద్రరక్షక ! హే ఉపేంద్రముకుంద !
చంద్రచూడస్తుత జలజాస్త్ర జనక !
కమనీయ కథ దైత్య గర్వశాంతికర !
యమ సఖే దాని ప్రి యంకుడునాథ !
శ్రీవధూవల్లభ శ్రితలోక సులభ
శ్రీవత్స రుచిరాంగ చిరతరపురుష
గుణపూర్ణ కారుణ్య కౌస్తుభాభరణ
అనఘ మదన రూప ఆర్యమాంత్రాహి, !
శరజాక్ష జగతీశ జనరక్షణ పర
గురుతరగుణ పాహి గోవిందరాజ !
దేవభో ! పద్మాక్ష దీనరక్షణ విభో !
పావన చరిత భో ! ప్రణమామిత్వాంభో !
మరియుఁ గన్గొనఁగ హేమమయ సౌధమున
నరయ మహోవిమా నాంతరమునను
చింతామణి మయ సింహాసనమున
కాంతామణి యురంబు గదిసి రంజిల్ల
కౌస్తుభమణి యందు కడుదీప్తులొసగ
నిస్తుల వనమాల నెరి దాపి నింప
విమల హారంబులు వెడ నిగ్గు నెఱవ
కమనీయ శంఖచక్రము లిరుగడల
నయనేం దురవుల విన్నాణంబుఁ జూప

నయముగా వీనులన్మకర కుండలము
లలరు విల్కాని సోయగములఁ గెల్చి
బలిమిఁ దెచ్చిన డాలు పగిది నింపెనఁగ
ఘన కిరీటంబు కంకణము లుంగరము
లనుపమ భుజకీర్తు లంగదంబులును
మిసిమి యొడ్డాణంబు మేలుతరంపు
పసిడి రెంటెముమీద బరగు మేఖలయు
గండ పెండేరముల్ కటిఁ గట్టి నట్టి
మండలాగ్రముఁ జీరు మంజీరములును
మించులుగల రతనంపు మెఱుగునిగ్గులును
మించుల మించులగల మించి రాణింప
జగమెల్లనాక్రమింపఁగ గమకంబు
దగుపాదముల చక్కఁదనము పిక్కటిలు
పిక్కలొయ్యారపు బిగువందుతొడలు
మిక్కిలిసింగమున్ మెచ్చనికౌను
మురువుహుమ్మనిచూపు మూపులసొబగు
కరికరంబుల డాబుగల భుజంబులును
పూవుఁబోడులచంటి పోటులనీటు
శ్రీవత్సమను మచ్చచే డాచునురము
గొల్లగుబ్బెతఁ సంకులగాజులొత్తి
మల్లాడుదద్దురుల్ మాయనిగళము
పాలకడలిపట్టి పట్టినబాళిఁ
గ్రోలఁగ్రోలఁగ తృప్తిగొలుపనిమోవి
కరుణారసముగుల్కు కన్నుదమ్ములును
చిరునవ్వువెన్నెల చిలుకునెమ్మొగము
నంగకాంతి వితమునంటి సొమ్ములకు
సింగారమొనరించు చెలువుమీరంగ
పొంగారుకార్మొగుల్ భువినిల్చినటుల

శృంగారమొకమూ ర్తి చేకొన్నపగిది
కన్నులభాగ్యంబు గనుపట్టియెదుట
నున్నతాకృతిఁదాల్చి యొప్పుచున్నటుల
నుడివోనిజవ్వనం బొరపుమేనూని
పుడమిపై నాడుచు పొడచూపినటుల
నెల్లసోయగములు నేకీభవించి
యల్లనచ్చైతన్య మందినయటుల
నానందమంతయు నావిర్భవించి
జ్ఞానసంపదలీల సల్పుచున్నటుల
సతతంబు సిరులిచ్చి జనులఁబ్రోవంగ
వితరణ దేవత విలసిల్లినటుల
ధారుణి గావించు తపములవలన
భూరిపుణ్యములొక్క ప్రోవైనయటుల
చెలగుచునిలుచున్న శ్రీవేంకటేశుఁ
దిలకించి యతఁడెదన్ తెలివికలంగ
భయవిస్మయానంద భక్తిదైన్యములు
రయకంప పులకసంభ్రమము లతఁడొమె
యుదర కన్రెప్పవేయక వెసఁజూచి
పుడమిఁజాగిలిమ్రొక్కి పొదలిబాష్పములు
గురియక్రమ్మరలేచి కోరికలెల్ల
మఱచిచూచుచునిల్చె మందభావమున

... ... ... ...

... ... ... ...

శ్రీనివాసులు బ్రహ్మచేయించినట్టి
మానితోత్సవమున మదిసంతసించి
అరవిందజునకు హేమాంబరాభరణ
వరములొసంగి యోవనజాతజాత
మెచ్చితినీభక్తి మిగులఁగోరినది

యిచ్చెదనడుగుమీ వెల్ల యిష్టంబు
లను డాహారికి ధాత యర్మిలి మ్రొక్కి
వినతుఁడై కేలోఁమోడ్చి వెసనిట్టులనియె
వేదాంతవేద్య ! యో విశ్వవిశ్వాద్య !
నీదు కైంకర్యంబు నీయందుభక్తిఁ
గలిగించితివి యింతకన్న భాగ్యంబు
కలదె యెట్లయినను కాంక్షితంబొకటి
దేవయిందరికిని దృశ్యుండవగుచు
శ్రీవేంకటాచల శిఖరంబునందె
యీలాగు ప్రతివర్ష మిమ్మహోత్సవము
చాలఁగైకొనుచుఁ బ్రసన్నతమెఱయ
వరదుఁడవై యెల్ల వారిరక్షింప
గరుణఁజేయుచునుండఁ గావలెనిదియె
వరమని ప్రార్థింప వనజసంభవుఁడు
నరుదారగా నిట్టులనియానతిచ్చె
పంకజాసననీవు ప్రార్థించినటుల
వేంకటగిరియందె విహరింతునెపుడు
సకలలోకములకు సాక్షాత్కరించి
ప్రకటిత సర్వసంపదలనొసఁగుదును
వేదశాస్త్రమువంటి విద్యవేరొండు
శ్రీదేవికినయగు చెలువమొకర్త
భూమికిసరియైన భూతమింకొండు
స్వామిపుష్కరిణికి సాటితీర్థంబు
వేంకటాద్రికి నుద్ది విష్ణుస్థలంబు
వేంకటేశ్వరుఁబోలు వేరొక్కదైవతము
సత్యంబుగాఁగ నెచ్చట లేదు లేదు
ప్రత్యక్షముగను మాపతిసాక్షి యిందు

# వేంకటేశ్వరవిలాసము

చెళ్లపిళ్ల నరసకవి.

## నారదకృత వేంకటేశ్వర స్తవము

క॥ పరమేష్ఠితనయుఁడప్పుడు
పరినర్తితుఁడగుచు శాస్త్రపద్ధతి మెఱయన్
పరివాదినీవినోద
స్వరసరణింబాడి మఱియుఁ బ్రస్తుతిఁ జేసెన్ !!

సీ॥ బహుచిత్రచిత్ర ప్రభావాయ ! భావాయ !
కల్పితాఖిలలోక కారణాయ !
ధీజనస్తుత వాసుదేవాయ ! దేవాయ !
నందితాశ్రితనంద నందనాయ !
నళినలోచన జగన్నాథాయ ! నాథాయ !
దాసకామిత ఫలదాయకాయ !
సన్మునీంద్రసుహృన్నిశాంతాయ ! శాంతాయ !
పరమపావన భక్తపాలనాయ, !

గీ॥ శంఖచక్రధరాయ ! తార్క్ష్యధ్వజాయ !
శేషశైలవిహారాయ ! శ్రీధరాయ !
దివ్య శ్రీవేంకటేశాయ ! తేనమోస్తు
టంచు వినుతించి మఱియు నిట్లంచుఁబొగడె ! !

శ్రీ

# మధురవాణీ విలాసము

చింతలపల్లి వీరరాఘవకవి.

చ॥ శ్రీ కల్యాణి సురత్నభూషలుతనుం జేర్పందదాకారితా
నేక శ్రీలవరించు భ్రాంతికయిలన్నిగోరు భావంబు దా
నాకాంక్షించి నిరంతరాయముగఁ దత్ప్రాణేశ వక్షస్థలిన్
జేకోనా నలమేల్దారన్ గొలిచెదన్ శ్రీవేంకటాద్రి ప్రభున్.

ఉ॥ లేమికి మేలుసంపద లవిన్ శిరికన్ననుమేలు ప్రాభవం
బామహిమాప్తికన్న భువనాధిపతిత్వము మేలు దాకనన్
సామిభజింప మేల్భజనవల్నగు మేలలమేలునిచ్చిదా
నామహితాఖ్యఁగొల్చు సతి కంజలి యయ్యలమేలుమంగకున్.

క॥ శ్రీవేంకటేశ ! నీలా
దేవీహృదయేశ ! సకలదిత సుతయాద
స్థావర దాశపురోనలి
నావృత సురవేశ త్రిభువనైక నివేశా.

క॥ భూమీ నీళావిభ్రమ
కామీ ! బృందావనైక గామీ ! క్రీడా
గోమీ ! జీమూతనిభ
శ్యామీ ! శివసామి వేంకటాద్రిస్వామీ !

మాలిని॥ ముద్రమా పరిముద్రితాత్మసముద్రజా హృదయాధిపా !
భద్రదంతిప భద్రదానిరుపద్రవామృత దాయకా !
ఛిద్రవర్జిత ఛిద్రసాప్తరుచిద్రవైక మనోహరా !
నిద్రితాలివినిద్ర శేషఫణీంద్ర వద్దనుజాంతకా !

క॥ శంకరషణ్ముఖ పవిభృ
త్పంకజభవముఖ సమస్తబర్హిర్ముఖరా
ట్సంకల్పకల్పసాధన
వేంకటనాథాభిధాన ! విశ్వనిదానా ! !

క॥ ఓంకారనిలయ మణిమయ
కంకణనవరత్నఖచిత గ్రైవేయముఖా
లంకరణ గణవిభూషిత
వేంకటనాథాభిధాన ! విశ్వనిదానా ! !

క॥ అంకుశ కులిశశరాసన
పంకజశరశంఖచక్ర పదచిహ్నితప,
త్పంకజయుగళోజ్జ్వల శ్రీ
వేంకటనాథాభిధాన ! విశ్వనిదానా ! !

క॥ పంకయుత దనుజగజలస
దంకుశనిశితాస్త్రగణనిరంకుశ ఫణిప
ర్యంకప రేశపరాంకుశ
వేంకటనాథాభిధాన ! విశ్వనిదానా ! !

క॥ హంకారహరణ ! కరుణా
లంకార శుభప్రదానలక్షణ ! శశ్వ
ల్లంకారివినుతపదయుగ !
వేంకటనాథాభిధాన ! విశ్వనిదానా ! !

క॥ సంకర్షణాదిరూప వి
శంకటశృంగార విభవసర్వంకష దా
మాంకనిజభక్తపోషక !
వేంకటనాథాభిధాన ! విశ్వనిదానా ! !

క॥ శంకరశరపన్నగహారి
శాంకరథాంగాంగ శారదాభ్రాభ్రధునీ
ఝంకారకృద్యశస్సుత !
వేంకటనాథాభిధాన ! విశ్వనిదానా ! !

క॥ పంకజశరజననీకుచ
కుంకుమముఖ గంధసారకోమలసంప
త్సంకలిత తతభుజాంతర !
వేంకటనాథాభిధాన ! విశ్వనిదానా ! !

అలమేల్మంగాంగనారత్నంబు మాధవుని స్తుతించుట

ఉ॥ దండము పన్నగేంద్రవసుధాధరనాథ ! గతాపరాధ, వే
దండకులేంద్రరక్షణవిధాననిదాన ! కృపార్ణవేంద్ర ! ! నీ
దండను జేర్చి ప్రోవు జగదండనివాసవిలాస నన్నుఁ బూ
దండగ నేలుకో నవసుధామధురాధర ! భార్గవీధరా ! !



౧౦

# శ్రీ వేంకటాచలమాహాత్మ్యము

తరిగొండ వెంకమాంబ.

## బ్రహ్మకు శ్రీవేంకటేశ్వరులు ప్రత్యక్షమగుట—బ్రహ్మస్తుతి

వ॥ అప్పుడాలోక కర్తయైన నారాయణుండు దయార్ద్రుండగుచుఁ గ్రీడామంటప మధ్యంబున నవరత్నస్థగిత పద్మపీఠంబునందుఁ బ్రాకృత ప్రకాశుండై మఱియును:—

సీ॥ మకుటకౌస్తుభరత్నమకరకుండలములు
ఘనమేఖలాంగదకంకణాలు,
వరనవమాలికా వైజయంతులదీప్తి
సలరు గ్రైవేయకహారములును
కనకాంబరంబొగిఁ గాంతుల నీనుదే
హామునందు వెలుఁగఁగా నభయదాన
కలితదక్షిణకరకమలంబు పావన
చరణంబు లర్చింప సరవిఁ జూప

తే॥ వామహస్తాంబుజము కటి సీమనొప్పఁ
దక్షిణ కరంబులను శుభదమగుశంఖ
చక్రములకాంతు లెసలార శస్త్రకాంతి
సర్వతోముఖుఁడై దయాస్వాంతుఁడగుచు.

క॥ హరి ముదమొందుచు నుండఁగ
వరవక్షమునందు సత్యపరభూషణమై
సిరి దనరఁగ నిరుగడలను
ధరణియు నీళయు వసించి తద్దయు మెఱయన్.

సీ॥ నీలమేఘమునందు నిలిచిన క్రొక్కాఱు
మెఱుపురీతిగ సిరి యురమునందుఁ
గుడిభాగమున నీళ యెడమభాగంబున
భూదేవి బహురత్నభూషణములు
బంగరంచులుఁ గుసుంబావస్త్రములు దాల్చి
కుటిలాలకంబులు నిటలములను
లీలగఁ జాలమిళింద పఙ్క్తుల వలెఁ
జెలియింపఁ గస్తూరి తిలకములును.

తే॥ గనులఁగాటుక గంధలేపనము లమర
వరకిరీటంబులను విరిసరులు గదలఁ
జంద్రబింబనిభాస్య లాచక్రధరునిఁ
గొలిచి మెలఁగుచు సంతోషకలిత లయిరి.

వ॥ ఇవ్విధంబున నతి కోమల తులసీదళచ్ఛాయ దేహకాంతి నొప్పుచు దక్షిణహస్తంబున నీలోత్పలంబుఁ బూనిన భూదేవియు, విద్యుల్లతాసంకాశయై ప్రకాశించి కరంబునం గరంబు మెఱయు శ్వేత కమలంబు ధరించిన శ్రీదేవియుఁ గమలకర్ణికాసన్నిభయై దీపించి వామ కరంబున శోణాంబుజంబు దాల్చిన నీళాదేవియు, హరింజేరి ఛత్రచామ రంబులు పట్టిన సుందరీమణులు గొలుచుచుండు సమయంబున శ్రీనివా సుండు కరుణాకటాక్ష వీక్షణుండై బ్రహ్మేంద్రాదులకుఁ బ్రత్యక్షంబయ్యె. అప్పుడు బ్రహ్మాదులు శ్రీహరికిం బునః పునః ప్రణామంబు లొనర్చి పుల కాంకిత శరీరులై సంపూర్ణానందంబున గద్గదకంఠులై బాష్పపూరితాక్షులై కరంబులు మొగిడ్చి యిట్లు నుతించిరి.

దండకము॥ శ్రీమత్పరాకాశ శేషాచలాధీశ, మంగాముఖోల్లాస మానీంద్రహృద్గేహ, శృంగార సద్భక్తమందార మాధుర్య వాగ్వ్రాత

మాయాగుణాతీత, సర్వార్థనిర్ణేత, సన్మోక్షసంధాత శ్రీభూమి నీళాసమే తాంబుజాతాక్ష పాఠీన కూర్మామిత్రక్రోడరూపా నృకంఠీరవా వామనా రామరామా మహాసీరహస్తా యశోదార్భకా బుద్ధకల్కి ప్రభావోజ్జ్వలా కార కాలానురూప ప్రకారాద్భుతానంత లీలావతారా నిరాకార వేదాంతసారాబ్ధి గంభీర హేమాద్రి ధీరాప్రకారాకరా పాదసంసారదూరా చిదాకారకారుణ్య పూరాగమాగణ్య పుణ్యానుగుణ్యా సదాక్షిణ్య హైరణ్య నేత్రాది దైత్యేశ్వరారణ్య దావానలజ్వాల దేవేంద్ర ముఖ్యామర శ్రేణి పాలా సుశీలా సువర్ణాభ చేలా రమాలోల విశ్వాదిమూలా మహాయోగి జాలాత్మ కంజాతరోలంబ బింబాధరా కంబుకంఠా నిరాలంబ గోవింద నందాత్మజా గోప బృందావనా దివ్య బృందాట వీవాస కందర్పసౌందర్య మందస్మితాబ్జోపమానా సదానంద చిత్తా ముకుందా గదా శంఖచక్రాద్యనేకాయుధాఘోరనక్రాంతకా దీనమాతంగ సంరక్షకా ఖండచండప్రతాపాలసత్కుండలాలంకృతా జాండభాండోదరా నంతశాంత స్వరూపా ఘనిర్లేపనిర్వాణ మార్గప్రతీపారణోద్దామలోకాభిరామా ఘనశ్యామ, సంపూర్ణకామా మహాశత్రుభీమా, జితశ్శౌర్య భీమా మునిస్తోమ దేవోత్తమా దేవతాసార్వభౌమా, సదామిమ్ము సేవించు మమ్మెల్ల రక్షించు మీశా సుఖావాస శ్రీమన్నృసింహా నమస్తే నమస్తే నమః !

## శ్రీ వేంకటేశ్వరస్వామిని సనకాదిమునులు స్తుతించుట

మ॥ మునులారా! పరిపూర్ణకాములు మహాముఖ్యుల్ జగత్పావనుల్
తనరన్మీరు వరంబు లొల్లమని నిత్యానందముం బొందినం
దున సంతోషము నొందితిం బరమశాంతుల్మీకుఁ గామ్యార్థముల్
పనిలే దాత్మల మద్గుణానుభవమే పాటింపు డశ్రాంతముల్.

తే॥ పరమ మునులార నిర్గుణబ్రహ్మమైన
నేను సగుణ విలాసము లొనపులకుఁ

జూపి రక్షింపఁదలచి యిచ్చోట నిలిచి
యుండ నిట్లుందు నంతట నిండియుందు.

ఉ॥ కావున మద్వియోగ మొగిఁగల్గదు పూర్ణవివేకి కంతటన్
నావిమల స్వరూపమును నాటఁగఁ జూపుచు నుందుఁగాన స
ద్భావనచేత వాఁడు నను బట్టుగ నంతటఁ జూచుచుండు మీ
రావిధమున్ గ్రహించి చనుఁ డక్కడ నిక్కడ నుందు నెంచఁగన్.

తే॥ అప్పు డందు శిలా విగ్రహంబు కరణి
నమరియుండిన శ్రీవేంకటాద్రి విభుని
జూచి మునిపుంగవులు కడు చోద్య మంది
పూర్ణభావనచే వారిఁ బొగడి రిట్లు.

శ్లో॥ సరోజపత్రలోచనం సుసాధులోక పావనం
చరాచరాత్మక ప్రపంచ సాక్షిభూత మవ్యయం।
పురారి పద్మజామరేంద్ర పూజితాంఘ్రి పంకజం
స్మరామి వేంకటేశ్వరం చ సాగరాత్మజేశ్వరం॥

శ్లో॥ పురాణపూరుషం సమస్తపుణ్య కర్మ రక్షణం
మురాసురాది దానవేంద్ర మూర్ధదర్ప భంజనం।
ధరాధరోద్ధరం ప్రశాంత తాప సాత్మ వీక్షణం
స్మరామి వేంకటేశ్వరం చ సాగరాత్మజేశ్వరం॥

శ్లో॥ శరాసనాది శస్త్రబృంద సాధనం శుభాకరం
ఖరాఖ్యరాక్షసేంద్రగర్వ కాననోగ్ర పావకం।
నరాధినాథ వందితం నగాత్మజాత్మ సన్నుతం
స్మరామి వేంకటేశ్వరం చ సాగరాత్మజేశ్వరం॥

శ్లో॥ సురారిశౌర్య నిగ్రహం సుపర్వరాట్పరిగ్రహం
పరాత్పరం మునీంద్రచంద్ర భావగమ్యవిగ్రహం।
ధరామరాఘ శోషణం సుధాతరంగ భూషణం
స్మరామి వేంకటేశ్వరం చ సాగరాత్మజేశ్వరం॥

తొండమానుడు వేంకటేశ్వరస్వామిని స్తుతించుట

ఉ॥ సద్గుణమొప్పఁగా మది నచంచల భక్తిరసంబు నిండఁగా
గద్గదకంఠుఁడై నృపుఁడు కన్నులుబాష్పములొల్క మ్రొక్కుచున్
మద్గురుచంద్ర నన్నిచట మానసమందుఁ దలంచి వచ్చితే
చిద్గగనాత్మ నీమహిమ శేషుఁడు సన్నుతిసేయ నేర్చునే?

శా॥ నేనా మానవమాత్రుఁడన్ జపలుఁడన్ నీచాత్ముఁడం గాముఁడన్.
నే నిన్నేమి నుతింపనేర్తు నను మన్నింపన్ స్వభావంబుచే
నేనిర్హేతుకజాయమాన కరుణ న్నేఁడిందు వేంచేసినా
వానందం బొదవెన్ గృతార్థుఁడనైతి నే నైతిన్ జగన్నాయకా.

మ॥ మును నేఁ జేసిన నేరముల్ మఱచి నా మూర్ఖత్వమున్ గర్వ మె
ల్లను బోఁగొట్టుచుఁ దండ్రిచందమున నన్ లాలించి విజ్ఞాన మి
చ్చిన నీ దొడ్డఋణంబుఁ దీర్చఁగలనే, శ్రీస్వామి నీ సత్కృపా
ఘనతం గాంచితి నిన్నినాళ్ళపుడు మోక్షం బిచ్చి రక్షింపవే.

చ॥ మతిసెడ విప్రుభార్యను గుమారుని గూఁతును దేఱ కేను జం
పితి నటువంటి పాప మిల భీకరవృత్తిని ముంచునంచు నా
హితముగఁగావ వారలకు హెచ్చుట దేహములిచ్చినట్టి నీ
యతిశయమెంచ శంభునకు హాటకగర్భునకైన శక్యమే.

చ॥ సతిపతి యేకమైనపుడు సారవివేకములేక రాత్రి వ
చ్చితి నలనాఁడు నే నిటులఁజేసిన ద్రోహము నెంచ కింత బ్రో
చితి యటువంటి నైరణయుఁజిక్కునె యెంతటివారికైన శ్రీ
పతి నినుబోలు వేల్పులు ప్రపంచమునం గలరే రమేశ్వరా!!

౧౧

# వేంకటరమణశతకము

వత్రి రమణప్పకవి.

క॥ దశరథరాజకుమారా
కుశికాత్మజసవనవిఘ్నకులసంహారా
పశుపతి హృదయ విహారా
విశదయశఃస్ఫూర్తిసార - వేంకటరమణా !

క॥ నిగమార్థ ప్రతిపాద్యా
యగణితచిద్రూప సంభృతానందమతీ
జగదారాధ్య నిరంజన
విగతాఖిలకలుషనిచయ - వేంకటరమణా !

క॥ ఉద్యద్రవి కాంతులచే
ఖద్యోతము లణఁగుభంగి ఘనభక్తిమహో
విద్యోతముచే గాఢా
విద్యానాశంబు నొందు - వేంకటరమణా !

క॥ అతికఠినము చాంచల్యము
మతిఁ దల్పక లోభమోహ మాత్సర్యముచే
సతతంబుఁబాయ దాశ్రిత
వితతి నాజీవనంబు - వేంకటరమణా !

క॥ భోగములఁ గోరి మధురా
నాగరికులు రాఁగజూచి నారాయణ నీ
వాగమృతధార నుబ్బఁగ
వేగమె తనిపితివి కరుణ - వేంకటరమణా ! !

౧౨

## వేంకటేశ్వర శతకము

తాళ్లపాక పెదతిరుమలార్య విరచితము

## నీతిసీసపద్య శతకము

సీ॥ శ్రీదేవి యురమున శిరసునఁ దులసి భూ
కాంత వీఁపునఁ బదాగ్రమున గంగ,
కమలాసనుఁడు నాభిఁ గాముండు మనసున
సవ్యవామాక్షుల శశియు రవియు
ధ్వజమున గరుడుండు తపసులు కాంతుల
సకలవాయువులు నాసాపుటముల
జగములు కుక్షిని జలధులు తరులందు
ఘనరోమముల దేవగణములెల్ల
గలిగి శోభిల్లు నీమూర్తిఁ దలఁచి నీకు
నీసశతకంబుచెప్పెదఁ జిత్తగింపు
కలితలక్ష్మీశ! సర్వజగన్నివేశ!
విమలరవికోటిసంకాశ! వేంకటేశ!!

సీ॥ పరమనాస్తికునకు భక్తివాదము లేల
షండునకేటికి సతులపొందు
పాపకర్మునకేల వరపురుషార్థంబు
ధనలోభికేల బాంధవముచింత
మూర్ఖునకేటికి మొదలనే మొగమోట
మన్మృతవాదికిని మర్యాద యేల
వెట్టివానికినేల విమల విచారంబు
పరదూషకునకేల పరముచింత
సరసునకుఁగాక వివరింప సద్గుణంబు
లెందుఁజూచిన మందున కేల గలుగు
కలితలక్ష్మీశ! సర్వ జగన్నివేశ!
విమలరవికోటిసంకాశ! వేంకటేశ!!

౧౩

# వేంకటేశ శతకము

## తాళ్లపాక పెదతిరుమలాచార్యులు

సీ॥ నయకోవిదులు తప్పనడచిరేనియు వారి
వరుస గా దది కర్మవశము గాని
ధనికులు భోగింపఁ దలపఁజాలమివారి
బాగు గా దది జన్మఫలము గాని
పుణ్యులు పాపంబుపొంతఁ బోయిన వారి
గతులు గా వవి దైవికములు గాని
సుజనులు లోకనిష్ఠురులైన నది వారి
జాడ గా దుత్పాతసరణి గాని
యెఱిగి నడువంగ వారలయిచ్చ గాదు
ధర్మదేవత మెలఁగు చందంబు గాని
కలితలక్ష్మీశ! సర్వజగన్నివేశ!
విమలరవికోటిసంకాశ! వేంకటేశ!!

సీ॥ పదుగురాడినమాట పాటియై ధరఁ జెల్లు
నొక్కఁ డాడినమాట యెక్కదెందు
నుఱకయుండినవాని కూరెల్ల నోపదు
నిజముముందరఁ గల్ల నిలువ దెపుడు
చేసినచింత దాఁచినను బుట్టక పోదు
దేవతలకునైనఁ దీఱ దాస
రాజు చేసినది ధర్మంబై ప్రవర్తిల్లు
కపటాత్ముతోఁబ్రొందు కడకుఁ గీడు
పుడమిలోకులు మెచ్చంగ నడవవలయుఁ
జలము సాధింపఁ జెల్లదు సభలలోన
కలితలక్ష్మీశ! సర్వజగన్నివేశ!
విమలరవికోటిసంకాశ! వేంకటేశ!!

సీ॥ జీలువు పెరిగిన మాలెకంబము కాదు
గొడ్డుఁ బెంచినఁ బాఁడిగోవు గాదు
ధరఁ బంచితం బెంత ప్రచ్చిన నేయి గా
దెండమావులును నీ ళ్లైపుడు గావు
పరగ నుల్కలు నూఱు బండిమో కిలఁగాదు
కూర యెంతైనను కూడు కాదు
ఎనుపోతు ఘనమైన నెద్దుతో సరిగాదు
కడు నశుద్ధపువాగు గంగ కాదు
తొండంబుఁగలిగిన దోమ యేనుగు గాదు
కోడి కోయిల గాదు కూత లిడినఁ
బ్రబలి చూపట్టినవి యుల్లఁ బనికిరావు
ధీరుఁడగునాతఁడొక్కఁడే వీరుఁ డరయ,
కలితలక్ష్మీశ ! సర్వజగన్నివేశ !
విమలరవికోటిసంకాశ ! వేంకటేశ !!

సీ॥ కాంచనపాదముల్ గజ్జెలు నందియ
ల్గడుమించు మొలఁ జంద్రకావిదట్టి
పీతాంబరముమీఁద బిల్లల మొలనూలు
బిగియించి కట్టిన పెనుకటారి
వరదానకరము నుజ్జ్వలకటిహస్తంబు
పటుశంఖచక్రోరు బాహుయుగము
నౌరసైననాభియు నుదరబంధ మురంబు
నలమేలుమంగతో హారములును
శిరసు మకుటంబు తిరుమణి చిత్రమకర
కుండలమ్ములుఁగల మిమ్ముఁ గోరి దలఁతు
కలితలక్ష్మీశ సర్వజగన్నివేశ
విమలరవికోటిసంకాశ ! వేంకటేశ !!

# వేంకటరమణ శతకము

రత్నమాంబ

క॥ నీదాసదాసినగు నా
కేదరిఁ జూపెదొ భవాబ్ధి నీఁదఁగఁ జాలన్
నీదయ శ్రీధర నమ్మితి
వేదాంతవిచార ధీర వేంకటరమణా !

క॥ ఆడింతువు మదిలోపల
నీడలుగాఁ దోచునట్టి నిగమాదుల నీ
వాడవు వాటిని గూడుక
వేడుకతో నించుకైన వేంకటరమణా !

క॥ చుక్కల నెన్నఁగవచ్చును
మక్కువ నీ నామగూప మహిమల్ క్రమతన్
లెక్కింప బ్రహ్మకైనన్
వెక్కసమై తోఁచఁబడును, వేంకటరమణా !

క॥ వేడను ధనధాన్యంబులు
వేడను దీర్ఘాయు వవని వేడను కీర్తిన్
వేడను వైకుంఠాదుల
వేడెద నీపాదసేవ వేంకటరమణా !

సీ॥ అవనిపై మంత్రి వంశాంబుధిసోముండు
పెనుగోళ్ళ గోత్రుండు ప్రియధనుండు

ఎలమి రూష్ఖాన్‌పేట హోమభూపత్యగ్ర
తనయుఁడు నతులసద్ధర్మశాలి
భవ్యుఁ డనంతభూపతి యా నరేంద్రుని
యర్ధాంగియగు రత్నమాంబయందు
శ్రీవేంకటేశుఁ డక్షీణ కటాక్షంబుఁ
జేర్చియు శతకంబుఁ జేయుమనుచు

గీ॥ నాజ్ఞనిచ్చినఁ జెప్పితి ప్రాజ్ఞు లిదియుఁ
కరుణ వెలయఁగఁ జూచి సత్క్రమముతోడ
లక్షణాదులు చెడిన సలక్షణముగ
తీర్పుఁజేయుఁడి మదుల సందేహ ముడిగి.



## ౧౪

# అలమేలుమంగా విలాసము

### యక్షగానము

శా॥ శ్రీలక్ష్మిన్ నిజ వక్షమందు నిడి కుక్షిన్ సర్వలోకంబులున్
లీలామాత్రము తోడ నుంచి సుమణిశ్రేణీపినద్ధోజ్జ్వల
న్మాలాలంకృతుఁడై నితాంతమలమేల్మంగా కరాంభోజమున్
గేలం బట్టెఁ వేంకటాద్రిపతి సత్కీర్తిన్ మముం బ్రోవుతన్.

క॥ ఈపగిది పద్మలోచనుఁ
డాపుర మేలుచును బ్రజల ననవరతంబున్
కాపాడుచు ధర్మస్థితు
లేపారగ వెలసె నఖిల హితకరుఁడగుచున్.

ద్వి॥ ఆసమయంబున నా వెంకటాద్రి
వాసుని భాసుర వర రథోత్సవము
వైభవంబులు జూడ వసుమతియందు
శోభిల్లు ప్రజలెల్ల సొబగున వచ్చి
శ్రీవేంకటాద్రీశ ! శేషాచలేశ !
గోవింద ! గోవింద ! గోవింద ! యనుచు
పరమ సంతోష నిర్భరచిత్తు లగుచు
గరుడోత్సవం బాదిగాఁ గల్గు సర్వ
సలిలోత్సవములను సరవిఁ గన్గొనుచు
కలుషముల్ పోఁదోలి గరిమతో విజయ
దశమినా డధికరథారోహణంబు
కుశలత్వమునఁ జేసి కొమరొందియున్న

శ్రీనివాసుని గాంచి చిత్తంబు లలర
దీన మందార ! నదీశగంభీర !
మంగళదేవతా మానసచోర !
తుంగ విక్రమ ! మహాదోష విదూర !
పాలయాస్మాన్ సత్కృపాలయ ! భవ్య
శీల ! మంజుల గుణశీల ! యటంచు,
పరిపరి విధముల వర్ణించి రంత.

## సౌరాష్ట్రం — ఆదితాళం

ధవళం॥ జయ రవికోటి సంకాశా — జయజయ కారుణ్య నివేశా
జయజయ సద్గుణకోశా — జయజయ శ్రీవేంకటేశా
జయ పాలితామర బృందా
జయ ఘన సచ్చిదానందా
జయజయ శౌరి ముకుందా,
జయజయ వరద గోవిందా ! !
జయజయ వారిజనేత్రా
జయజయ జలధర గాత్రా
జయజయ విమల చరిత్రా
జయజయ కామగిరి మిత్రా

శోభనము॥ వేదము లొసగిన ధన్యునకూ,
విబుధుల బ్రోచిన మాన్యునకూ,
భూధరము గాంచిన మూర్ధన్యున
కాదిమమూర్తి నృసింహునకూ — ॥ శోభనమే, శోభనమే ॥
వైభవమున వేంకట విభునకు
వటువై వెలసిన శౌరికినీ —

వసుధాపతి సంహారికినీ
పటుకుల రావణ గర్వవిదారికి
బలదేవునకు మురారికినీ
పరమాధ్వరఖండనరతికినీ
తురగము నెక్కిన ఘనధృతికీ
వరకామాచల మందిర హితమతి
కరుదుగ వేంకట గిరిపతికీ!

మంగళహారతి :—

జలధిసుతా కుచకలశవిలేపిత, కలితసుగంధ భుజాంతర తే,
ఖిల దానవకుల జలదసమీర, లలితచరితనిశ్చల భవ తే,
అతివరభాసుర సరసీరుహ పరమపురుష శుభకర భవ తే,
మురహరగురుతర దురితతిమిరఖర కరమందరగిరి ధరభవ తే,
కామజనక కలికామద జగదభిరామ నికామ నిరామయ తే,
కామాచలపురధామ హితామలనామక వేంకటనాయక తే॥

జయమంగళం, నిత్య శుభమంగళం॥

# తిరుమల శ్రీవేంకటేశ శతకము

## భగవత్ప్రాప్తి—రేఫప్రాసకంద పద్యములు

క॥ సిరియురమున మెఱయఁగ నరి
దరములు కరముల ధరించి దయచే జగముం
బరిపాలించుచు నుంటివి
తిరుమల శ్రీవేంకటేశ ! త్రిదశాధీశా !

క॥ తరుణారుణచరణా ! భవ
తరణా ! భయహరణ ! గోత్రధర ! కరుణాబ్ధీ !
శరణాగతు నను బ్రోవుము
తిరుమల శ్రీవేంకటేశ ! త్రిదశాధీశా !

క॥ కరివరుమొఱ విని బిరబిర
నరిగి దయంబ్రోచినాడ వని వేడితి నా
మొఱ వినరాదా నరహరి !
తిరుమల శ్రీవేంకటేశ ! త్రిదశాధీశా !

క॥ కరి యేమి కట్న మిచ్చెను
బరికింపఁగ శబరి యేమి భాగ్యమొసంగెన్
ధర వారిఁ బ్రోవ లేదా
తిరుమల శ్రీవేంకటేశ ! త్రిదశాధీశా !

క॥ పురుషోత్తమ ! నావిన్నప
మరమర సేయక గ్రహింపు మతికృప వెలయన్
త్వర నపవర్గ మొసంగుము
తిరుమల శ్రీవేంకటేశ ! త్రిదశాధీశా !

క॥ కొఱమాలిన విషయంబుల
మరిగి నిను భజింపకున్న మతిహీనుఁడనై
పొరలితి బహు జన్మంబుల
తిరుమల శ్రీవేంకటేశ! త్రిదశాధీశా!

క॥ శరణనఁగ నావిభీషణుఁ
గరుణను ద్రౌపదిని హరిని గాచితి వది నీ
బిరుదై సను నను బ్రోవుము
తిరుమల శ్రీవేంకటేశ! త్రిదశాధీశా!

క॥ పరమానందాత్మక! శ్రీ
హరి! నీమాహాత్మ్య మజభవాదులకైనం
దర మౌనె యభినుతింపఁగఁ
దిరుమల శ్రీవేంకటేశ! త్రిదశాధీశా!

క॥ అఱనిముసములోన జగ
త్పరికల్పన రక్షణప్రభంగంబుల న
చ్చెరువుగ నొనరించెదవా
తిరుమల శ్రీవేంకటేశ! త్రిదశాధీశా!

క॥ పరుఁడవగు నీవు జీవే
శ్వరజగదాకృతులఁదోఁచి స్వప్రభచేఁ ద
త్పరవికృతు లొంద వెన్నఁడుఁ
దిరుమల శ్రీవేంకటేశ! త్రిదశాధీశా!

క॥ ఇరవుగ జగముల లో నిడి
మఱి జగములలోనఁ జొచ్చి మహిమ దలిర్పన్
నెఱి సాక్షివిగా నుందువు
తిరుమల శ్రీవేంకటేశ! త్రిదశాధీశా!

క॥ హరి ! నీయందుఁ బ్రపంచము
పరికల్పితమాట నన్యభావము గలదే ?
పరగ నసంగాద్వయుఁడవు
తిరుమల శ్రీవేంకటేశ ! త్రిదశాధీశా !

క॥ పురుషోత్తమ ! నిను బ్రేమను
స్మరియించిన దినమె దినము చర్చింప భవ
చ్చరణార్చకుండె ధన్యుఁడు
తిరుమల శ్రీవేంకటేశ ! త్రిదశాధీశా !

క॥ పురసంహారకమిత్రా !
సరసీరుహపత్రనేత్ర ! జలధరగాత్రా !
పరమపవిత్ర చరిత్రా !
తిరుమల శ్రీవేంకటేశ ! త్రిదశాధీశా !

క॥ శరచర కచ్ఛప కిరి నర
హరివయి భృగురామ రామ హరి బుద్ధతను
స్ఫురణలఁ బ్రభవించితివో
తిరుమల శ్రీవేంకటేశ ! త్రిదశాధీశా !

క॥ తరణము గౌతమతరుణికి
దరణము భవమునకు మోక్షదంబగు యుష్మ
చ్చరణము నెఱ నమ్మితి నేఁ
దిరుమల శ్రీవేంకటేశ ! త్రిదశాధీశా !

క॥ కరి మకరిచేత వడి సెడి
మఱిమఱి నినువేఁడ మొఱను మఱవక వినీ స
త్వరఁ జని ప్రోచితివి కదా
తిరుమల శ్రీవేంకటేశ ! త్రిదశాధీశా !

క॥ పరదైవత మీవని మది
నెఱ నమ్మితి నన్నుఁ బ్రోవ నీకు భరంబే ?
దురితము లెన్నక యేలుము
తిరుమల శ్రీవేంకటేశ ! త్రిదశాధీశా !

క॥ ఉరగాధిపగిరివాసా !
పరమ మహోల్లాస ! నిత్యభాసురహాసా !
నిరతిశయసుఖవిలాసా !
తిరుమల శ్రీవేంకటేశ ! త్రిదశాధీశా !

క॥ నెఱ నమ్మితి మనమున నీ
చరణములే గతి యటంచు సదయుఁడవై చే
చ్చెర పరమగతి నొసంగుము
తిరుమల శ్రీవేంకటేశ ! త్రిదశాధీశా !

క॥ జయజయ కరుణాసాగర !
జయజయ సర్వజ్ఞ ! సకల జగదాధారా !
జయజయ సర్వజనాధిప !
జయ తిరుమల వేంకటేశ ! జయ సర్వేశా !!

భుజిపెళ్ల భగవచ్ఛాస్త్రి, జగ్గయ్యపేట ప్రాంతము నివాసము. క్రీ. శ. 18[illegible] ప్రాంతమువారు. గోవిందశతకము శంకరవిజయము వీరి ఇతర గ్రంథములు. శతక సముచ్చయము Part 2 ఆం. సా. పరిషత్ప్రకటితము.



౧౨

# శ్రీ వేంకటేశ్వరశతకము

ఊడుమూడి—సూరపరాజు

చ॥ హరునకు మ్రొక్కి పార్వతికి నంజలిఁ జేసి వినాయకాఖ్యదే
వరకు నమస్కరించి మది వాణికి దండమొనర్చి చంద్రభా
స్కరులకుఁ గేలు మోడ్చియును గబ్బము మీకొనఁగూర్తు ద్వారకా
తిరుపతి వేంకటాచలపతీ ! నను బ్రోవుము వేగ శ్రీపతీ !

చ॥ వరకవితా పటిష్ఠుఁడగు వ్యాసునకున్ మఱి తిక్కయజ్వకున్
నిరతము భట్టుమూర్తికిని నిత్యము బమ్మెర పోతరాజుకున్
సరవిని మ్రొక్కి మీకుఁ గృతిచంపక మాలలఁ గూర్తు ద్వారకా
తిరుపతి వేంకటాచలపతీ ! నను బ్రోవుము వేగ శ్రీపతీ !

చ॥ వరయతి లక్షణజ్ఞులగు వందితసత్కవులెల్ల మెచ్చఁగా
గరిమను నేకప్రాసశతకం బొనఁగూర్చి సుపుష్పమాలగా
నరహరి మీకొనర్చెదను నారదగానవిలోల ద్వారకా
తిరుపతి వేంకటాచలపతీ ! నను బ్రోవుము వేగ శ్రీపతీ !

చ॥ ఇరవుగ నీదుకుక్షి నిరునేడు జగంబులు దాల్చి దిట్టవై
బరగిన నీవు దేవకికి బాలుఁడవై యుదరంబులోపలన్
బెరుగుట దెట్లు నేర్చితి వభేద్య చరిత్ర మహాత్మ ద్వారకా
తిరుపతి వేంకటాచలపతీ ! నను బ్రోవుము వేగ శ్రీపతీ !

చ॥ హరుఁడట నీకు మిత్రుఁడు హిమాలయపుత్రి నుతించు భక్తులౌ
వరముచికుంద భీష్మశుకవ్యాసపరాశరవాలఖిల్యతుం
బురులట నీదు నామరుచి నొందిరి మూఢుఁడనేను ద్వారకా
తిరుపతి వేంకటాచలపతీ ! నను బ్రోవుము వేగ శ్రీపతీ !

చ॥ శరనిధిఁ గట్ట నావుడుత సంతసమందుచు సైకతంబులోఁ
బొరలుచు గట్టుపై దులిపి పోవుటఁ జూచి దయాపరుండవై
తరుణమునందు దాని నటధన్యను జేసినతండ్రి ద్వారకా
తిరుపతి వేంకటాచలపతీ ! నను బ్రోవుము వేగ శ్రీపతి !

# ౧౮

# శ్రీ తిరుమలగిరి వేంకటేశ్వరశతకము.

(ఏకప్రాసకంద శతకము)

శ్రీమాన్ నల్లాంచక్రవర్తుల సంపత్కుమార శ్రీనివాస వేంకటాచార్యకవి

క్రీ. శ. 1750 ప్రాంతమువారు. కృష్ణాతీరమున ముక్త్యేశ్వరము కాపురస్థలము. వైష్ణవమతసిద్ధాంత బోధనార్థమని నియమింపబడిన సింహాసనస్థులలో నొకఁడట యీయన.

క॥ సిరులవలంతిఁ జేర్చిన నీ
యురమునసే నేను నిరత మొనరించెడి భ
క్తిరసప్రార్థనఁ జేర్చుము
తిరుమలగిరి వేంకటేశ! దేవాధీశా!

క॥ శరణాగత సంరక్షక
బిరుదాంకితమూర్తి! భార్గవీమానసపం
కరుహదివాకర! భాస్వర
తిరుమలగిరి వేంకటేశ! దేవాధీశా!

క॥ కరము ముదంబున వేంకట
గిరిని నధిష్ఠించినావు కృప భక్తాగ్రే
సరులను బ్రోచుచునుంటివి
తిరుమలగిరి వేంకటేశ! దేవాధీశా!

క॥ ధర ధర్మములన్ విడి నీ
శరణొందిన నఘము డులిచి సంరక్షింపన్
వరద! ప్రతిజ్ఞం గొంటివి,
తిరుమలగిరి వేంకటేశ! దేవాధీశా!

క॥ దరి గానక యుంటిని ని
సరి లేరని తలచుచుంటి సద్గుణనిధి! పా
మరతను వే పోఁగొట్టుము
తిరుమలగిరి వేంకటేశ! దేవాధీశా!!



౧౯

# వేంకటనగాధిపతి శతకము

మంచెళ్ల కృష్ణకవి

ఉ॥ శ్రీమహిళాభిరామ మునిశేఖరసంస్తవసీమ తోయద
శ్యామ మరుల్లలామ సమరాంగణభీమ నితాంతవైభవో
ద్దామ సమస్తభవ్యగుణధామ మహీజనదోషహృత్ప్రశ
స్తామితనామ వేంకటనగాధిపతీ! విలసత్కృపామతీ.

చ॥ శరధిగభీర! భీరహిత శత్రుగిరీంద్రశతార! తారకా
వరరుచిసార! సారసభవస్తుతసద్గుణవార! వారణ
స్ఫురదవతార! తారకయశోవిభవోజ్జ్వలభార భారసా
హరణవిదార! వేంకటనగాధిపతీ! విలసత్కృపామతీ!

చ॥ సకలకళావిశేషముల జాడ లెఱింగినవాఁడ గాను తా
వక కమనీయ నిర్భరకృపారసభాసుర వీక్షణాప్తిచే
సుకవితఁ జెప్పఁ బూనితి యశోనిధి యింకిట నన్ను జంటవా
యక ఫల మిమ్ము వేంకటనగాధిపతీ! విలసత్కృపామతీ!

ఉ॥ బంటుగ నేలికొమ్మనుచుఁ బల్మఱు నెంతయు వేఁడుకొంటిఁ గ్రే
గంట దయారసం బొలుకఁ గన్గొనుమంటి రమాధినాథ మీ
వంటి మహాప్రభుం గొలుచు భాగ్యముఁ గంటి భవార్తులింక న
న్నంట వటంటి వేంకట నగాధిపతీ! విలసత్కృపామతీ!

ఉ॥ మానము సంతతంబు ననుమానములేల భవత్కథాను సం
ధానము నీపదార్చనవిధానము యుష్మదమేయ భక్తి వి
జ్ఞానము తావకప్రణుతగానము, త్వత్పదపద్మ నిశ్చల
ధ్యానము దేవ! వేంకటనగాధిపతీ! విలసత్కృపామతీ!

చ॥ కలియుగవేళ శ్రీహరిని గన్గొన లేమని మూఢబుద్ధిచేఁ
దెలియఁగ లేక మానవులు దీనతఁ జిక్కిరి గాక వేంకటా
చలమున నున్న మిమ్ముఁ గని సన్నుతిఁ జేసిన నీప్సితార్థమేఁ
దలఁతురు గాదె వేంకటనగాధిపతీ! విలసత్కృపామతీ!

ఉ॥ చేసిన పాపమెల్ల మఱిచెప్పినఁ బాయునటండ్రు పాపముల్
జేసిన హాని యంచనక సేయఁగఁగాంచి మహోగ్రకృత్యముల్
జేసితిఁ గాన నీకెఱుఁగఁజేసితి నేగతి నన్ను బ్రోచెదో
యాసురవైరి వేంకటనగాధిపతీ ! విలసత్కృపామతీ !

ఉ॥ వేమరు వేడసాగెనని వేసటనొందితొ యట్లుగాక నీ
పామరుఁ బ్రోవ నెయ్యది యుపాయమటంచును జింతఁ జెందితో
యేమొఱఁ బెట్టినం దలఁచ వెక్కడి రాజసమయ్య నీకు భ
క్తామరశాఖి వేంకటనగాధిపతీ ! విలసత్కృపామతీ !

ఉ॥ ఆగమవేద్య మీ భజన మబ్బని వారి కశేషసత్క్రియా
భోగము లేల, రాజ్యసుఖభోగము లేల, చరాచరాది సం
యోగము లేల సాంఖ్యముఖయోగము లేల సమస్తయాగముల్
త్యాగము లేల, వేంకటనగాధిపతీ ! విలసత్కృపామతీ !

ఉ॥ మంగళమార్యసంగ ! జయమంగళమీశ మనోజ్ఞభృంగ స
న్మంగళమూర్తిభంగ ! శుభమంగళమభ్రచరత్తురంగ ! శ్రీ
మంగళముజ్జ్వలాంగ ! శివమంగళమాశ్రిత సౌఖ్యకృద్దయా
పాంగతరంగ ! వేంకటనగాధిపతీ ! విలసత్కృపామతీ !

ఉ॥ పంబినప్రీతి నేగతి భవం బెడబాపి కృతార్థుఁ జేసెదో
యంబుజనాభ నామతి మహావిపరీత మదెన్నరాదు చి
త్తంబు వశంబుగాదు విదితంబున నన్గరుణింతువన్న ధై
ర్యంబుఱగాదు, వేంకటనగాధిపతీ ! విలసత్కృపామతీ !!

తిరుమల తిరుపతి దేవస్థానం ప్రెస్, తిరుపతి ఫు. 250. 1-5-52.

# తప్పొప్పుల పట్టిక



| పేజీ. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
| --- | --- | --- | --- |
| 8 | 7 | ఘువ్వులులై | ఘువ్వులై |
| 28 | 17 | పట్టముస | పట్టణమున |
| ,, | ,, | వృషి | వృష్టి |
| 30 | 8 | ర్యాఢునుని | ర్యాఢ్డునుని |
| 32 | 6 | చా స్త్రి | చాఘ్న స్త్రి |
| 43 | 21 | ఈ లిల | ఈ లీల |
| 44 | 21 | ఘులకున్ | ఘకులన్ |
| 45 | 15 | వాగ్దోత్ర | వాగ్గోత్ర |
| 51 | 2 | విల్ | వృల్ |
| 51 | 18 | ర విా | ర మూ |
| 52 | 10 | ము నోసగు | ను నోసంగు |
| 52 | 13 | ధార చే | ధార ఘు |
| 60 | 10 | మొఱగు | మొఱుగు |
| 75 | 6 | యెం త్తై | యెం తై |
| 77 | 1 | హాోము | హేము |
| 78 | 18 | పొదోలి | పోద్రోలి |
| 86 | 2 | నార్ధ మని | నార్ధ ము |

